శోభనవాద్యముల్ సొరిది మ్రోయఁగను
నారావమున శౌర్య శాయింటి యావు
భోరునఁ బలుపుత్రెంపుక పెండ్లికొడుకుఁ
దాఁకి నంతటఁ దప్ప దానిపై వైచి
వీఁకతోఁ గొంపోము వేగంబవచ్చి
యనిన సాశ్చర్యుఁడై యా రాజు వారి
కనియె నాపద్ది బ్రాహ్మణుఁడట వినఁగ
నిటనాల్గు మూన్నాళ్ల కీపురమ్మునను
నటు మీరు గొంపోయినట్టిది గలదె !
యనిన వారప్పుడు నందందఁ దాము
గొనిపోవుటెల్లఁ బేర్కొని చెప్పి రపుడు
నా మన్త్రిమాని క్రిందాయగ్రజన్ము
శోమలి నిద్రింపఁ గొంపోతి మనుచు,
నా విధంబంతయు నట వారలనిన
నా విప్రవర్యుండు నదియేటి మాట
యీ పెండ్లికొడుకున కిట్లయ్యెనేని
నా కుడంతి విధమ్ము నట్టిదే ! యనిన
నట్లె కాకన వారలట్లుండునంతఁ
బట్టణంబేగి యా బ్రాహ్మణోత్తముఁడు
నంగన కప్పుడు నా ముహూర్తమున
మంగళసూత్రమ్ము మఱిఁ గట్టువేళ
సంభోధి గలఁగ మహా వాద్యరవము
గుంభిని చెలఁగ సంకులముగా మ్రోయ
తలుగు త్రెంచుక యావు తఱుముక వచ్చి
కలఁగి బెదరుచు మూఁకలఁ బాయఁ ద్రోలి
క్రూరత నా పెండ్లికొడుకుఁ దాఁకినను
గోరి యాదూతలు గొంపోయి రపుడు
నదిగని యా విప్రుఁడద్భుత మంది
యిది యథార్థంబని యిచ్చ నూహించి
తన దుఃఖ మెడలించి తనయుండు దాను
మనుజేంద్రుఁ బొగడె నా మహీసురోత్తముఁడు
నంతటఁ బాండీశు నా విప్రకులుని
కెంతయు ధనమిచ్చి యెలమి వివాహ

మరుదారగా నాడు మఱి వేడ్క ననుదు
గరిమతోడుత నంపె గౌరవమ్మునను
నా భిల్లనాయకు నటకు రప్పించి
నీ భార్య నీ సుతుల్ నినుగాన కిపుడు
నేమంచు వగతురో! యేగుము వేగ
తామసింపక నంచుఁ దగఁ గట్ట నిచ్చి
చాల మన్నించి క్రచ్చఱ దాని ననిచి
హాలాస్య నాథుని నట్టాలచొక్క
నాయకుఁడైన సౌందర్యవల్లభునిఁ
బాయక పాండ్యుఁడు భక్తితోఁ జేరి
త్రైలోక్యనాయక! త్రైలోక్యవంద్య!
త్రైలోక్యదేవతాధ్యక్ష! ఫాలాక్ష!
బ్రహ్మస్వరూప రూపా బ్రహ్మేంద్రవంద్య!
బ్రహ్మాండమాలికాభరణవినోద!
దేవదేవ మహేశ దేదీప్యమాన
లావణ్యపూర్ణాంగ! దంశితానంగ!
నీ పాటవీవాస! నిఖిలలోకేశ!
రూపించి యీసింపఁ బ్రోచితి! యనుచు
మనమున హర్షించి మఱి సంస్తుతించి
తన మందిరముకేగె దై. పాండ్యుఁడు
పాయక దేవుండు పళియంజి చొక్క
నాయకుఁడను వేడ్క నామంబు దాల్చె
సరవి నాపళియంజి సౌందర్యకృపను
ధరణిఁ బాలించె నా ధరణీవల్లభుఁడు
వినతులై యీ లీల విన్న పుణ్య
జనములు పాతక సంహారులగుచు
వెఱపును మఱపును వీడంగనాడి
పరగ సాయుజ్యంబు ప్రాపింతు రిపుడు
వినరయ్య యిది చతుర్వింశతి లీల
యనిన బ్రియమంది యమ్మహామునులు
నా వింధ్యదర్పాపహారిఁ గీర్తించి
యావలి చరిత మాకానతిమ్మనిన
నా కుంభసంభవుఁ డాత్మ నుప్పొంగి

యా మహామునులకు నప్పుడిట్లనియె.
నిది సర్వజ్ఞ సత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలుండు వత్స
కప్పుర సౌరభ్యకలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితంబుగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణకావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చారిత్ర
మందున నిది చతుర్థాశ్వాస మయ్యె

---

# పంచమాశ్వాసము.

## ఇరువదియైదవ లీల

శ్రీకర కరుణార్ద్ర శ్రీరామభద్ర !
రాధాసుతత్యాగ రంజినాభాగ
భాగీరథీ వంశపావనోత్తంస !
రాగదోష విముక్త ! రణజయాసక్త !
బసవభూవరపుత్ర ! భాగ్య చారిత్ర !
పొసఁగంగఁ జినరామభూపాగ్రజాత !
వినుగోళ్ల పెదరామ ! విభవసుత్రామ !
యనుపమజయధామ ! యధికసత్ప్రేమ
ఘటజన్ముఁ డావాని గణముల కపుడు
నటమీఁది చరిత మిట్లానతి యిచ్చె
మధురాపురమ్మున మఱి దేవ పాండి
ధర్మమ్ము దప్పక ధర యేలుచుండఁ
బగగంగ నొక వృద్ధ బ్రాహ్మణోత్తముఁడు
తరుణి పయోరూప ధన్యురాలైన
బాలికామణిని పెండ్లాడిన పిదప
నా లేమ యౌవనప్రాయమ్ము మించి
బాలుని నొకని దర్పకమూర్తిఁగాంచె
నావిప్రతనయుండు నధిక సౌందర్య
పాత్రుఁడై యౌవనప్రాప్తిఁ జెన్నొంది
మాతృ సంగము జేసె మది నిల్వలేక
యీ విధి దుర్గోష్ఠు లెసఁగఁ గొన్నాళ్ల
కావృద్ధుఁ జూచి భార్యాత్మసంభవులు
నీవార్త లెవ్వరు నెఱుఁగక మున్న
యీ వృద్ధు వధియించు టిది కార్యమనుచు
సతిసుతు లిద్దఱు సమ్మదమ్మునను
నతనిఁ జంపిరి గరళాన్నమ్ము వెట్టి
యాతని తనయుండు నందఱితోడ
నా తండ్రి పాలు వంటకము నీ రేయిఁ
గుడుచుచో నా కూడు కుత్తుకఁ జిక్కి
పడిఁ జచ్చెనని యతివ్యాకులుండగుచు

సరవిని నగ్ని సంస్కారమ్ముఁ జేసి
తరుణిఁ దోడ్కొని కల ధనమెల్లఁ గొంచుఁ
దనయూరు విడిచి యాతలి దేశమునకుఁ
జనుచు నుండంగఁ దస్కరులటఁ బట్టి
తలఁ బగులంగఁ గొట్టి ధనమెల్లఁ గొనుచుఁ
బొలఁతిని బట్టుకపోయి రయ్యెడను
గడు వేదనలఁ గుంది గాత్రంబు గంది
యొడలెల్లఁబుచ్చి యాయుర్వ్రణురుంతు
నేయూరి కేగిన నెల్లరు దన్ను
నీ యనిరోయఁ జూచినవారలెల్ల
నరయ వీఁడెంత పాపాత్ముఁడో ! యనఁగఁ
దిరిపి ప్రాఁతలు గట్టి తిరునుక చినఁగఁ
బుణ్యతీర్థమ్ములఁ బుణ్యవాహినుల
బుణ్యస్థలులకును బుణ్యభూములకుఁ
బోయి తత్కర్మమ్ము పోఁద్రోతు ననఁగ
నాయొడఁ దన బ్రహ్మహత్య పోనీదు
పరగంగ నీరీతి బహుళ దుఃఖములఁ
బొరలుచుఁ దన పూర్వ పుణ్యమ్ము వలన
నా మహా మధురాపురాధీశుఁడైన
శ్రీమన్మహాదేవు శ్రీ చొక్కనాథు
నగరికి నేతేర నందికేశ్వరుఁడు
నగణితంబైన పాపాత్ముఁడ వీవు
నిటకును రావల దెందేనిఁ బొమ్ము
కుటిలాత్మ ! యనుచును గోపించి పలుక
నా దేవుఁ డిట్లను నలరంగ వీఁడు
నేదిక్కు దెసలేక యిటు వచ్చినాఁడు
రానిమ్ము బసవన్న ! రానిమ్ము ! యనిన
నా నగజాత యిట్లని విన్నవించె
నిట్టి మాతృద్రోహి నీ పితృఘాతు
నెట్టు రమ్మంటిరి యీశ్వరా యనిన
హరుఁడు శర్వాణి కిట్లని యానతిచ్చె
గిరిజ వీఁడన నొక్క కీటకాధముఁడు
వీఁడన నెంత యీ విశ్వమ్ములోనఁ

బోఁడిమి చెడి యతుల్ మునులు దేవతలు
వావివర్తనములు వరుసలు దప్పి
భావజన్మని మాయఁబడరె పూర్వమున
హరియు నా బ్రహ్మశక్రాదుల కైన
మరులు పుట్టించును మదనసాయకము
లను చహంకారరై యాశంబరారి
పనుపడి వర్తించుఁ బలుమాయ మెఱసి
యిటుగాక మఱి విను మీ వాసభూమి
కుటిలపాతకశైల కులిశ మీ మధుర
యెట్టి పాతకియైన నీ మహాస్థలము
మెట్టి మాపై భక్తి మేకొనగలిగి
దినముఁ బొత్తామర తీర్థమ్ములాడి
మనుజులు మిగుల బ్రహ్మహత్యాది పాత
కములెల్లఁ బోనాడి కైలాసపదవిఁ
బ్రమథులతోఁగూడి బ్రతుకుచుండెదరు
నిది సిద్ధమనుచు నయ్యీశ్వరి కపుడు
విదితమ్ముగాఁజెప్పె విశ్వనాయకుఁడు
నంత నా విప్రుండు నాచొక్కపతికి
నంతనంతన మ్రొక్కి యటవచ్చి నిల్చి
యభయమో సర్వేశ ! యభయమో వరద !
యభయమో మహదేవ ! యభయమో స్వామి !
యభయమో వృషభేశ ! యభయమో జియ్య !
యభయమో మధురేశ ! యభయమో యీశ !
యభయమో చొక్కనాయక ! మహాదేవ
యభయమో పల్లియంబి ! హాలాస్య నిలయ !
యఖిలాపరాధిని నఖిలదూషకుఁడ
నఖిల పాపాత్ముఁడ యఖిలేశ యేను
మాతృపితృ ద్రోహమగ్నుఁడ నధిక
పాతకుండను బిత్రుబ్రహ్మ ఘాతకుఁడ
నాపాప పటల మంతయుఁ బాపి నన్నుఁ
జేపట్టి రక్షించు శ్రీ చొక్కనాథ !
యని విన్నవించిన నా దురాత్మకుని
మనమునఁ గరుణించి మధురేశ్వరుండు

వానినిఁ బిలిచి దుర్వారమై నిన్ను
బూనిన పాతకంబులు వాపు కొఱకుఁ
గపిలధేనువులకుఁ గసవులు దెచ్చి
కృపతోడ మేపుము కృతమతి వగుచు
దినమును మున్నూఱు దేవాలయముల
దనరంగ సంప్రదక్షిణల్ సేయు
వేయును నెనిమిది విశదమ్ముగాను
బాయక గాయత్రిఁ బఠియించు భక్తి
శ్రీరుద్రమెప్పుడు శుచినిష్ఠతోడ
సారసద్భక్తిని జపియింపు మనఘ !
భవ్యకల్పమ్ము నాపాద మస్తకము
నవ్య భస్మోద్ధూళనమ్ముగాఁ జేయు
పరమ మాహేశ్వర పాదతీర్థమ్ము
నిరతమ్ము సేవింపు నిజము వెల్లింపు
ప్రతి వాసరము హేమ పద్మాకరమున
నతి భక్తితోఁ ద్రిసంధ్యలఁ దీర్థమాడి
యొనర భిక్షాటనం బొకమాఱు గడపు
దినము నీరీతివర్తించెద వేని
నీ పాతకమ్మెల్ల నిఁకు పొమ్మనుచు
నా పరమేశ్వరుం డానతియిచ్చె
వాఁడును నారీతి పరుస మూణ్ణెల్లు
పోఁడిగా మాధుర్యపుర నాయకుండు
నానతిచ్చిన రీతి నాస్థలమ్మునను
మానుగా వర్తించి మది భక్తి మించి
శ్రీ చొక్కనాథుని సేవలు జేసి
హెచ్చిన పాతకంబెల్లఁ బోఁద్రోచి
శివలోకమున కేగి శివు కృపగల్గి
ప్రవిమలసాలోక్య పదవిఁ జెన్నొందె
నిది యిరువదియేను నిట మీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఇరువదియాఱవ లీల

మఱియును నొకనాఁడు మధురాపురమునఁ
బరగంగ నొకఁడు నభ్యాసియై సాము
నేయించుఁ గొందఱ శిష్యులఁ గూర్చి
నాయయ్యగారు వృద్ధాప్యమై యుండు
నాతని ప్రియ భార్య యతి సుందరాంగి
పాతివ్రతాచార బహుపుణ్య సాధ్వి
యీరీతిఁ బణికుఁడై యెల్ల శిష్యులకుఁ
గోరి సాములు చెప్పుకొని యుండునంత
నందులో నొకశిష్యుఁ డయ్యగారిచేత
నందమ్ముగా సాములన్నియు నేర్చి
తన పేరు వెలయ సిద్ధనగా రనంగ
ఘనముగా వేఱొక్క గరిడిఁ గట్టించి
తానును వేఱ కొందఱు శిష్యులకును
దానయ్యగళన? సాధన సెప్పుచుండె
నంతనా పణికుండు నా మహావృద్ధు
సంతతమ్ముగ మహేశ్వర భక్తిగలిగి
శ్రీ చొక్కనాథుని సేవయే ప్రొద్దు
నాచరింపుచుఁ ద్రిసంధ్యా కాలములను
గఱకంఠునకుఁ బ్రదక్షిణము సేయుచును
నిరతమ్ము దనదు మందిరమున కరుగు.
ఒకనాఁడు నతఁడు శిష్యుల నిండ్లకనిచి
మొకముఁ బ్రక్షాళించి మూదుక యా భవుని
నగరికిఁ బోయి దండప్రణామములు
తగు ప్రదక్షిణములెంతయుఁ బ్రొద్దు సేయ
నయ్యెడ నాసిద్ధుఁడతని యింటికినిఁ
జయ్యనఁ బోయి యా సాధ్వి చేఁబట్టె
పట్టిన నది యోరి పాపాత్మ! తల్లిఁ
బట్టంగ నీకును బాడియే యనుచుఁ
జే విదలించుక చిడిముడి పడుచు
నో విశ్వనాయక! యోచొక్కనాథ!
నా నాథుఁడతివృద్ధు నన్నింతఁ జేయ
వీనికిఁ దగునె యోవృషవాహనుండ!

అని చొక్కనాథుని నాయింతి చీఱ
మనమున దయగల్గి మదనాంతకుండు
నా సాధనయగారి యాకృతిఁ దాల్చి
తానెగట్టుక తలక కత్తియుఁ గొరడు
చేతను బట్టి యాసిద్ధునిఁ బిలిచి
నాతోడఁబోట్లాడి నాయిల్లు సొరగ
నీకౌనె యంచు వానిని ధిక్కరింప
దీకొని వాఁడును ధీరత మెఱసి
కత్తియు గొరడును గడిమితోఁ బూని
మొత్తువాఁడుగ వానిముట్టిన చెయ్యి
నటికి యాగొంతును నాలుకఁ గోసి
సరగునఁ దానదృశ్యంబయ్యె నంత,
వాని శిష్యులు వోయి వడి వృద్ధగురునిఁ
బూని మాగురునితోఁ బోట్లాడి చంపి
యిక్కడ వచ్చి సర్వేశ్వరునకును
నిక్కము భక్తిఁ బూనిన వానిఁబోలె
గుడిచుట్టు పిరిగెడు గురువుల వనికి
విడుతుమె ! నిను గొట్టి వేతుము గాక
యనిన నావృత్తాంత మాయయ్యగారు
తన యింటికిని వచ్చి తన యింతి నడుగ
నా చంద్రవదన యావృత్తాంతమ్ము సెప్పి
శ్రీ చొక్కనాథుఁడే సేయంగఁబోలు
ననినను విని యప్పుడా వృద్ధగురువు
మనమున సంతోషమంది వేగంబె
యా మహాదేవు దివ్యాలయంబునకు
వేగంబ యేతెంచి వృద్ధయ్యగారు
చొక్కనాయకుని సంశోభితస్తుతులు
పెక్కు భంగులఁ జేసెఁ బేరు పెంపెసఁగ
గర్వించినట్టి యా గజదైత్యుఁ బట్టి
యుర్విపైఁ గూల్చిన యుమజోడ ! శరణు
వ్యాఘ్రాసురుని బట్టి వ్రచ్చిపోనీక
శీఘ్రతఁ దునిమిన శితికంఠ ! శరణు
అంధకాసురు చక్రమందు ఖండించు

సింధురవరద ! యాశ్రితనాథ ! శరణు
యా నృసింహుని గర్వమణఁచి లోకముల
మానుగా రక్షించు మహాదేవ ! శరణు
దక్షయాగముఁ జెఱచి దైవతకోట్ల
శిక్షించి ప్రోచిన శివ ! నీవు శరణు
యజుఁడు గర్వించిన నచట మర్దించి
సుజనుఁడై గాచిన సువ్రత ! శరణు
యముని మార్కండేయునకై పూని చంపి
యము గర్వమణఁచిన యభవుఁడా ! శరణు
ముప్పురమ్ముల వారి మోది లోకములు
దప్పక రక్షించు దైత్యారి ! శరణు
గజవ్యాఘ్రము లంధక కమలాక్ష దక్షు
లజ మయ త్రిపుర దైత్యాదు లనంగ
నీ యెనమండ్ర గర్వ మేపుతోఁ బాపి
పాయనన్నట్టి సద్భక్త మందార !
నాకుగాఁ బాడి పంతము దప్పకుండఁ
దూకొని యీ గురుద్రోహినిఁ ద్రుంచి
ప్రాభవమ్మున నన్నుఁ బరికించి వేడ్క
నీ భక్తవరుని మన్నించితే దేవ !
యని సన్నుతులు జేసి యతి మోదమునను
దన యింటికరిగె సాదనయయ్యగారు
నీ ప్రసంగము విని యెల్లవారలును
నా పురి ప్రజలును నా పాండ్య విభుఁడు
నందంద నందఱు నాత్మ నుప్పొంగి
సౌందర్యుఁడిటు తన సద్భక్తునకును
దావచ్చి యద్ధన్ను దగఁ జేసె ననుచు
భావించి యాశ్చర్యపడి యుండి రంత
నిది యిరువది యాఱు నిటమీఁది లీల
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడు
ననుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ఇరువదియేడవ లీల

మఱియును నమ్మహామధుర లోపలను
బరగంగ నా పాండ్యపతి వంశమునను
నవతరించెను యుక్తుఁడను పాండ్యవిభుఁడు
శివభక్తిచే మించి శ్రీ చొక్కనాథు
పై భక్తి తాత్పర్యపరత నే ప్రొద్దు
సౌభాగ్యలక్ష్మికి స్థావరంబగుచుఁ
బ్రకటిత సకల భూభాగమ్ము దాల్చి
యకలంక మతిని రాజ్యము నేయుచుండెఁ
దలకొని జైన సంతతులెల్ల గూడి
చలపట్టి తమలో విచారమ్ముఁ జేసి
యధికుఁడు యుక్త పాండ్యావనీశ్వరుఁడు
విధిజూటుపై భక్తి విశ్వాసగరిమ
దనర నాశైవమ్ము ధరమించఁ జేసె
మన జైనమతమెల్ల మగ్నము జేసె
నిందుకు పాండ్య భూమీశ్వరుఁగూర్చి
క్రమముతో నాభిచారంబైన హోమ
మిప్పుడు గావింత మెల్లర మనుచు
నప్పు డంపటుగూడి యుగ్రహోమంబునను
నట్టి యాక్రూరమంత్రాదుల చేత
గట్టిగా నెన్నేని కాలముల్ వేల్వ
నాకుండమధ్యమ్ము నందొక్క ఘోర
రాకాసి జనియించె రభసమ్ముతోడ
నతఁడు శేషాకారుఁ డతిదీర్ఘ బాహుఁ
డతి భయంకరుఁడు దంష్ట్రాకరాళుండు
నున్నతోదరుఁడు నత్యుగ్రమ్మునైన
కన్నుల నిప్పులు గుఱు రాలుచుండ
నిబిడమౌ నుచ్ఛ్వాసనిశ్వాసములను
బ్రబలాభ్రపటలంబు వాయద్రోయుచును
ప్రేతాగ్ని లొక్కపై ధృతి మించి వచ్చు
భాతిగాఁ క్రూరసర్పంబు నేతెంచి
బలసి జైనుల యగ్రభాగమ్ము నందు
నిలచి యిట్లని పల్కె నిష్ఠురోద్ధతిని

దహనార్చులను దేహదాహమ్ము నంది
విహరింపుచున్నవి వేగ నాయందు
నయ్యెడు కార్యమ్ము నాత్మలో నెంచి
చయ్యనఁ బంపు డెచ్చటికైన ననిన
నతి సంభ్రమంబున నా జైను లెల్ల
నతి వికృతాకారమైనట్టి సర్ప
ముండుట గనుగొని మొగి వారలనిరి
పాండీని ప్రజల నా పట్టణంబెల్ల
నాశీవిషేంద్ర ! మాయాజ్ఞచే పట్టి
రాశిగా మ్రుంగి గ్రక్కి త్రేపఁ బొమ్ము.
అనిన నా మధురపై నతివేగమునను
ఘనమైన పర్వతాకారమ్ము దాల్చి
జిహ్వాగ్రమున నగ్నిశిఖలు పర్వఁగను
సంహారకారియై సంభ్రమంబునను
నురవడి వచ్చు నా యుగ్రాహిఁ జూచి
పురజనులెల్ల విస్ఫురణలఁ గ్రాలి
భీతమనస్కులై బెదరి యా ప్రజలు
నాతఱిఁ బాండీని కా క్షణమ్మునను
మొఱఁబెట్టి రప్పుడ మొఱయాలకించి
వెఱవకుండోయని వేగంబె వచ్చి
యాయుగ్రభుజగంబు నందందఁ జూచి
సాయకం బొకటెత్తి సంధించి మించి
తగఁ జొక్కనాథుని ధ్యానంబుఁ జేసి
తెగనిండఁ గొనియేసె ధీరత్వ మడర
నేసిన శరము బిలేశయు కంఠ
దేశంబు తఱుగ కదియును నేతేర
నేతేర, మఱియు ననేక బాణములు
భీతిల్ల నేసిన భీకరంబైన
విషములు గ్రక్కుచు విషధారి యపుడు
విషధులు నొక్కటై వెల్లిగా వచ్చు
టలుగాఁగఁ గాలకూటంబు చందమునఁ
దల కొని మధుర కుద్ధతి వచ్చుచున్నఁ
జూచి యా రాజును శూరత్వ ముడిగి

యా చొక్కనాథుని నాశ్రయింపఁగను
నా దేవు నగరికి నతివేగఁ బోయి
మోదంబు తోడను ముందట నిల్చి
గిరిజేశ ! యఘనాశ ! కీర్తి ప్రకాశ
పరమేశ ! భవనాశ ! భర్గ ! సురేశ
విషధరశశిధర విషమృత్యుహరణ !
విషధరభూషణ వేదాంతసార !
వ్యాసహస్తచ్ఛేద ! వశితానుమోద !
వాసవార్చిత పుష్పవాస ! సర్వేశ
సర్వజ్ఞ ! సర్వాత్మ ! శర్వాణిరమణ !
సర్వముక్తకలాప శైలేంద్రచాప !
బాణగానప్రియ బాణారివిశిఖ !
మీనాక్షీవామాంగ యీశ ! సర్వేశ
ఓదేవ ! యిదియొక్క యుత్పాతముగను
భూదివస్త్రాలను గప్పుచు సింధులకును
గాలాగ్ని చండానఁ గడఁగుచున్నదియ
నింతటఁ గాచి మమ్మీక్షణమ్మును
జింతిలకుండంగఁ జేయవే దేవ !
యని సన్నుతింపఁగా నాస్వామి వచ్చి
తన జటాజూటానఁ దగ నున్న యట్టి
చంద్రునందమృతమ్ము చయ్యనఁ దిగిచి
సాంద్రమ్ముగాఁ జల్లి శాంతిఁ బొందించె
వెలయంగ నప్పుడు విషముట్టుకసనఁ
బొలుపొందు హాలాస్య పురమునఁ జెరగె
విధుసుధాధారల వీథులఁ జల్ల
మధురాపురంబన మహి సొంపు మిగుల
నా విషంబణఁచి యా యహికశేఖరుఁడు
నావంక నాగాద్రియను పేరు జేసి
నగజేశుఁడా చొక్కనాథుండు తనదు
నగరిలో నపుడు నంతర్థానమయ్యె
నప్పుడా స్వామిని నా పాండ్యవిభుఁడు
నప్పౌర జనములు నభినుతుల్ చేసి
సంతుష్టులానందసంపూర్ణు లగుచు

## ఇరువది ఎనిమిదవ లీల

నెంతయు వేడ్కతో నేగి రప్పురికి
నిది సప్తవింశతి యిటు మీఁద లీల
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
మఱియును నారాజు మధురాపురమున
సర్వజనమ్ములు సంతుష్టి నుండ
నప్పుడు నా జైను లతిభీతులగుచు
గాంతార ఘోరదుర్గములలోనుండి
మంత్రబలమ్మున మఱియును బోవఁ
దంత్రముల్ వన్ని రంపలు గూడియపుడు
నేమి సేయుద మిట్టు లెన్నని వగల
భీమాకృతియుఁ గాఁగఁ జేర్చినయట్టి
యా సర్పమును బోయి యా పురజనుల
శాసింపలేక నిస్సత్త్వమై పోయె
ననుచును మఱియును నభిచారహోమ
మును సేయ నందు సముద్ధతితోడ
దిశలు గంపించు ధాత్రీధరాకృతిని
పశురూపమున ముద్భవమయ్యె నపుడు
నా యొక్క జైను లత్యంత శౌర్యమున
నా యావుఁ జూచి యిట్లని పల్కి రంత
బలసి చంపఁగ రాని పగ గెల్వరాదు
నిల గోవు వధియింప రెట్టివారైన
హాలాస్యపురమున కరిగి యా ప్రజలఁ
దూలించి పాండ్యునిఁ ద్రుంపు మీవనుచు
ననిచినఁ జని వేగ నా మహాపశువు
ఘనశృంగములు రెండు గగనమ్ము నొరయ
ఖురముల చేఁబుట్టు ఘోరంపుధూళి
హరిదంతదంతుల యక్షులు మూయ
కుతలమ్ము గొమ్ములఁ గోరాడినంత
నతలమ్ము నెల్ల ద్రవ్యయ్యలుగాఁగ నడుచు
రభసమ్మునోసట్టి అంకె వేసినను
నభము కంపించి ఘూర్ణిత్వమ్ము నంద

వాలమ్ము విసరిన వారిధు లేడు
కోలాహలమ్ముగాఁ గొందల మగుచు
మిన్ను నేలయు నొక్క మెయి పేర్చి కడఁగి
ఘున్నగా వచ్చు నా పశువును జూచి
యాపురి ప్రజలును నా పాండ్యవిభుఁడు
శ్రీపార్వతీశ్వరు శ్రీచొక్కనాథు
గుడిఁజొఱఁబఱచి యొక్కఁడు భీతితోడ
గడగడ వణఁకుచుఁ గలయఁ బాఱుచును
దేవ సర్వేశ్వర! దేవాదిదేవ!
పావకోజ్జ్వలనేత్ర! పవనాప్తగాత్ర!
యుర్వీధరశరాస! గోవిశ్వరూప
యుర్వీధర సుబాణ! యో జగత్త్రాణ
ఓమధురాధీశ యోసాంపరేశ!
యీ మహాప్రళయ మేమెఱుఁగ మెన్నఁడును
నదియొక్క పశువు ఘోరాకారమగుచు
పొదలుచు నడవచ్చెఁ బురిమెల్ల బెదరఁ
గరుణతో నీబారి గడపి మమ్మెల్ల
నరసి రక్షింపవే! హాలాస్యనాథ!
యని పెక్కు భంగుల నారాజ ప్రజలు
వినుతింప నంత నా విశ్వనాయకుఁడు
పడి శరణాగత వజ్రపంజరుఁడు
కడువేడ్క భక్తరక్షణ పరాయణుఁడు
పశుపతి యప్పుడా బసవన్నఁ బిలిచి
పశువొక్కఁడదె మహాప్రళయరూపమున
వచ్చుచున్నది దాని వారించి వేగ
నిచ్చటఁరమ్మి నందీశ్వర! యనినఁ
దనర బ్రహ్మాండపు గాత్రంబుతో నపుడు
తన ప్రతాపమ్మును ధారుణి మెఱయ
పర్వతాకారమై పరగు మూఁపురము
గీర్వాణవల్లభ గీర్వాణమునులు
నగణిత వేదవాక్యముల నర్చింపఁ
దగినట్టి నాల్గు పాదమ్ముల యందుఁ
దివిరెడు పసిఁడియందియల మ్రోఁతయును
నవరత్నకలిత ఘంటారవమ్ములును
పది దిక్కులను జెవుడ్పడఁ జేసి మిగులఁ
గడిసి కయ్యాలకుఁ గాల్దువ్వుచును
గడఁగి యుగాంత మేఘములు గర్జిల్లు
వడిని ఱంకెలు వైచి వాలమ్ము ద్రిప్పి

ఖురఘట్టనముచేతఁ గులగిరు లద్రువ
ధరణి కంపింపఁ బాతాళమ్ము బెగడ
గిరిశృంగములు రెండు కెరలు కొమ్ములను
ధరణి గోరాడు నుద్ధతశీల వచ్చి
పైనుఱంపిన యభిచారహోమమ్ము
ధేనువు ముందర ధృతి వచ్చి నిలిచె
నప్పు డాధేనువు నతిశోభభరము
గప్పి నిశ్చేష్టతఁ గనుదూలి మఱియు
నానందబాష్పమ్ము లక్షియుగ్మముల
నాని యందందఁ బాయలు గాఁగఁ దొరఁగె
పైనులప్పుడు మహాశ్చర్యమ్ము నొంది
దీనాననమ్ముల దిగ్భ్రమ లెసఁగఁ
బఱచి యందఱు భయభ్రాంతులై ఘోర
గిరిదుర్గములయందు ఖిన్నులై యుండి
యక్కట యీధేను వాపురిజనుల
దక్కక చంపునం దఱఁ జుట్టుముట్టి
యని నమ్మి పంపిన నది వృథయయ్యె
మన కృత్రిమంబు లామధురపైఁ జెల్లవు
శ్రీచొక్కనాథుఁడు చిత లీలఁగాచి
ప్రోచు నీ మాధుర్యపురి మహర్నిశము
నందునే దశలు? కల్పాంతకాలమునఁ
జెందగా వెలుచును శివునాజ్ఞ వలన
ననుచు నిరుద్యోగులై వనమ్ములకుఁ
జని యూరకుండిరి పైను లచ్చటను
నా నందికేశ్వరుం డానంద మెసఁగ
నా నందివాహను నగ్రభాగమున
గరిమతో నిల్చినఁ గని గారవించి
తిరముగా మా సన్నిధిని నెల్లవేళ
నుండుము బసవేశ! యెప్పుగా ననుచు
ఖండేందు జూటుండు కట్టడసేయ
నది యాదిగాఁ ద్రిపురారి ముందఱను
బదిలమ్ముగా నుండు బసవేశ్వరుండు
నాయావు పడినట్టి యాస్థలమ్మునను

నా కొండ వృషభాద్రి యళగరై యొప్పెఁ
గలయ నా ధేనువు కన్నీరు నంమఁ
దలయేఱు వను పేర ధర మించి వెలసె
సంగతితో నిట్లు సౌందర్యనాథుఁ
డంగయఁకణ్ణెక్కు కానతి యిచ్చె
ని యష్టవింశతి యిఁకమీఁది చరిత
నుడువులతోఁ జెప్పెద మునులార వినుఁడి.

## ఇరువది తొమ్మిదవ లీల

అనుచు సన్న్యాసులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.
అహిరాజ భూషణుండా నాస్మైన
మహిమ నెన్నికగల మధురలో కలను
ప్రతిలేని పాండ్యభూపాలుని యొద్దఁ
జతురుఁడై సుందర సామంతుఁ డనఁగ
భాసుర సేనాధిపత్యమ్ము దాల్చి
భాసుర సౌందర్యకలి సేవలంగఁ
జిత్తమ్ము రంజిల్ల సేయుచున్నంత
నత్తఱి పాండ్యభూపాగ్రణి మించఁ
జేదిరాజాదిక శ్రేష్ఠుఁడనట్టి
మెఱసిన నొకబోయ మేటి మన్నీఁడు
దండెత్తిరాఁగ నా దళవాయిఁ జూచి
పాండ్యుఁడు నప్పుడు ప్రజ గూర్చుమనుచు
భండారమందున్న బహుధనంబెల్ల
నిండారగా నిచ్చి నెమ్మిఁ బొమ్మనిన
నప్పుడా సామంతుఁ డతిమోదమానసు
దప్పక శివభక్తి తాత్పర్యపరత
మాహేశ్వరార్చనల్ మఱియు సర్వేశు
గేహమ్ములకును మిక్కిలిగాఁగ నొసఁగి
యొగి దాన ధర్మపరోపకారంబు
లగణితమ్ముగఁ జేసె నా విత్తమెల్ల
నప్పుడు పాండీని కావిధంబెల్లఁ
జెప్పిరి తోటి యా సేనాధిపతులు
చెప్పినఁ గినిసి యా సేనాని నటకు
రప్పించి మఱియంత రాణువఁ గూర్తు!

సామంత ! యనిన నా జనపాలుతోడ
శ్రీ మహామధురేశు శ్రీ చొక్కనాథు
సౌందర్యనాయకు సత్కృప చేత
నెందఱైన నేనేలితి దేవ !
యన్న నారాజును నట్లకాకనుచు
నెన్నిక చూపుము యెల్లి నేఁడనినఁ
దగు నట్లయనుచు నాదళవాయి యపుడు
నగజేశు నా చొక్కనాథునిఁ జేరి
యాదరమ్మున మ్రొక్కి యభినుతుల్ సేసి
యింద్రాది సురవంద్య ! యిభచర్మ వసన !
చంద్రార్ధ శేఖర ! చంద్రార్క నేత్ర !
త్రిపుర మదధ్వంస ! దీనమందార !
[యపవర్గ ఫలధామ] యద్రికోదండ !
దగ్ధశివద్రోహ తంత్రదుర్మంత్ర !
ముగ్ధేందు మండన ! మోహనాకార !
పటుమేదినీరథ ! ప్రణవప్రతోద !
చటులాలి ! చతురాస్య సారథ్యరథిక !
వేదాదిసన్నుత ! వేదస్వరూప
యోదేవ యిందుకు నొక్కత్రోవ నిమ్ము
వెలయంగ నా పాండ్య విభుఁడు నేఁడెల్లి
బలములఁ దెమ్మంచుఁ బలికె న తోడ
నీపాద సేవకు నీభృత్యు నన్ను
జేపట్టి యిపుడు రక్షింపవే దేవ !
అని సన్నుతింపుచు నధికసద్భక్తి
వినుతింప నప్పుడా వృషభధ్వజుండు
నతని కానతియిచ్చె నాత్మ శోభిల్ల
మదిలోన నీ వనుమానంబు డించి
భయమేలఁ జనుమెల్లి పౌజుఁ జూపెదను
రయమొప్ప మితిలేని ప్రజనెల్ల ననుచు
నశరీరరై ఎచ్చి యాస్వామి యపుడు
విశదమ్ముగాఁ బల్కె వినువీధి యందు
నంత నాసామంతుఁ డాత్మ నుప్పొంగి
సంతోషమునఁ దన సదనమ్ముఁ జేరి

తన పత్నితోడ సౌందర్యనాయకుఁడు
తన కానతిచ్చినంతయు వేడ్కఁ జెప్పఁ
జెప్పిన సంతోషచిత్తుఁడై యతివ
తప్పక నాస్వామి దయ నిన్ను బ్రోచు
నన నుదయంబాయె నా మఱునాఁడు
తనకు గల్గిన ప్రజఁ దాఁ గూర్చుకొనుచు
నగరి కేతెంచె నంతటను సౌందర్యుఁ
డగణితమ్ముగ సకలాధిదేవతలఁ
బమ్మిక మనుజరూపంబులు గాఁగ
రమ్మని బహుళసంభ్రమలీల మెఱసి
కొడఁగల్గి చొక్కమ్ము నెత్తించి యంత
వడి మీఱఁగాఁ బంచ వాద్యముల్ మ్రోయ
విశ్వేశ్వరుఁడంత వేడ్కతో నొక్క
యశ్వమ్ము దానెక్కి యా క్షణమ్మునను
దనరఁ బత్తిసాయుధమ్ముల తోడ
వెనుకొని రావుత్త వితతులు ప్రజలు
నెల్లరు గొలువంగ నేతెంచు పౌఁజు
లెల్లనప్పుడు మహోద్రేకమ్ముగాఁగ
నేల యీనినయట్లు నీరధు లెల్లఁ
జాలఘోషముతోడ సాగెనో ! యనఁగ
పౌఁజు లేర్పఱచుక పరమేశ్వరుఁడు
రాఁజూచి యప్పుడా రిభసమ్మునకును
వెఱచి యా పాండ్యభూవిభుఁడును గలఁగి
యరివీరులెల్ల నాహవరంగమునకును
నదె వచ్చుచున్నారు ! యటు చూడుఁడనినఁ
బరగ నాదళవాయి భయపడవలదు
పరులుగారది మన పరివార మధిప !
యా చిత్రకూటమ్మునందు విచ్చేసి
చూచుట మేలు పౌఁజులదేవ ! మీరు
ననిన వేగమ్ముతో నటకు నేతెంచి
మనుజేంద్రుఁడపుడు సామంతునిఁ బిలిచి
నడిపింపవలయు సేనల నిప్పుడనిన
నడరంగ నేఁబది యాఱు దేశముల

ప్రజలను జాతివర్ణము లేర్పఱిచి
యజిభభాండము లెల్ల నదర రప్పించి
నెలమితోఁ గళలు వ్రాయించె నత్తఱిని
దలకొని యంత సౌందర్యనాయకుఁడు
సవరణై యుత్తమాశ్వమ్ము పైనెక్కి
ధవళాతపత్రమ్ము దనరఁ బట్టగను
దండిగా నశ్వమ్ము దాఁటించుకొనుచు
నుండగఁ జూచి యాయూర్వీశ్వరుండు
నెవ్వరీతఁడు దన కెఱిఁగింపు మనిన
నవ్వసుధేశున కతఁ డిట్టులనియె
నీసేనకుఁ గర్త యీసేన పతఁడు
భాసిల్లఁ దెచ్చె సంభ్రమలీల ననిన
నప్పుడా రాజును నతని నిందులకు
రప్పింపుడనిన సంరంభంబుతోడ
నచ్చోటి కేతెంచి యాస్వామిఁ జేరి
విచ్చేయు మో దేవ ! వేడ్కతో మిమ్ము
ధరణీశుఁ డచటికిఁ దగఁ బిల్వఁ బంచె
ననిన నా సర్వేశుఁ డట్లకాకనుచు
మనుజేంద్రు కడకేగి మఱియు నిట్లనియెఁ
బ్రాఁతిగా మావర్ణ బంతినామములు
జాతి యేర్పఱచి యిచ్చెం వ్రాయవలయు
నని కళ వ్రాయించు నావిధంబునను
దన మెడ కప్పు నాదలయందు మఱకఁ
జూపి వ్రాయుఁడు నన్ను జొక్కరావుత్తు
నా పేరనుచును నానతి యిచ్చి యిపుడు
విడువు మెవ్వరినైన వీరులైనట్టి
కడిమి రావుత్తు సంగములకు ననుచుఁ
బేర్చి యార్చినఁ జూచి పృథ్వీశ్వరుండు
గూర్చుండ సంశయాకులచిత్తుఁడగుచు
నీ యశ్వమెక్కుమ నినుజూచి యేము
వ్రాయంగ నేలంచు వరుసతో నపుడు
నుడుగర లిచ్చిన నుత్తమాంగమున
నడల కుండఁగ జుట్టి సంభ్రమం బెసఁగ

నశ్వమ్ము నేనెక్కి యాడుటచూఁడు
విశ్వంభరాధీశ ! వేవేలగతుల
ననుచు నా సర్వేశుఁ డతిరయమ్మునను
దనమనమ్మున్నట్లు దగ నెక్కియాడు
నంత నా పాండీశు నా పౌరజనులు
సంతోషమంది యాశ్చర్యమ్ము నొంది
యీలాగు తేజీల నెక్కాడువారి
నేలోకమున గాన మిది చిత్రమనుచుఁ
దగఁ జూచుచుండ సౌందర్యనాయకుఁడు
చనియె నదృశ్యుఁడై చయ్యన నంత
నా కూడ సురలెల్ల నతిపుష్పవృష్టి
పాయక కురిసిరి పరమేశు మీద
నటు చోయరాజును వ్యాఘ్రమ్ము గఱచి
తటుకున నేగె నంతట స్వర్గమునకు
నా వార్త విని రాజు నద్భుతంబంది
శ్రీ చొక్కనాథుఁడాశ్రిత కల్పతరువు
మనపాల గలిగి సమ్మతిఁ బ్రోచె ననఁగ
తన దళవాయి సౌందర్య సామంతు
నటు జూచి మన్నించి యాత్మలో మెచ్చెఁ
దటుకున నతఁడు సౌందర్యునిఁ జేరి
తిరువాలవాయి ! యో దేవతారాధ్య !
పురహర ! శివలోకపురవాస ! యీశ !
విశ్వవిశ్వేశ్వర ! వేదాంతవేద్య !
యశ్వాయితామ్నాయ ! యద్రీంద్రచాప !
ఓచంద్ర సూర్యానలోజ్జ్వలనేత్ర !
శ్రీ చొక్కనాథ ! రక్షించితె నన్ను
ననుచు నా సామంతుఁ డతిభక్తితోడ
ననువందఁ బొగడి శివార్చనల్ చేసె
పరమేశ్వరధ్యాన భరతఁ జెన్నొంది
పరగంగ సాయుజ్యపదవికి నేఁగె
నిది యిరువదితొమ్మిదిట మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు

షడవమునఁ దలపోసి మఱియు నిట్లనియె

## ముప్పదియవ లీల

మఱియు నా పాండ్య భూమండలేశ్వరుఁడు
వరుడుగాఁ జొక్కనాయకు భక్తి గలిగి
ప్రజల రక్షించి శాత్రవుల శిక్షించి
భుజశక్తి మాధుర్యపుర మేలుచుండె
నా నృపాలకుఁడు బ్రాహ్మణద్వేషి యగుచు
దానమ్ములీయ కెంతయు నింద సేయ
నా విప్రులెల్ల సంధ్యలు జపహోమ
దేవతార్చాపితృదేవ తర్పణలు
నగ్నిహోత్రములు వేదాగమ ప్రోక్త
విజ్ఞానయోగ హవిర్భాగములును
సరవిని యజనాదిషట్కర్మములను
వరుసలు దప్పి తద్వ్రతములు మాని
బ్రాహ్మణాచారసంపద లెల్ల విడిచి
బ్రాహ్మణు లరిగిరి పరభూములకును
నది కారణమ్ముగా నా రాజ్యమునను
గొదవడి వర్షముల్ గుఱియక యుండె
నోషధులన్నియు నొనర దుష్కృత
దోషమ్ము వాటిల్ల దుర్దశ నొందె
దయ ధర్మము నడిగె ధాన్యమ్ము దఱిగె
నయము లేదాయె దానము లేకపోయెఁ
బరగ నీరీతిని పాండ్య దేశంబు
కరువు గాలముచేతఁ గడు చెడి నొచ్చి
యున్నచోటుల నుండ కోడి యందఱును
గన్నవారేగిరి కన్నత్రోవలకు
నారాజుఁ దన ప్రజలందఱు విడిచి
పోయినఁ దానేలు భూమండలమ్ము
శూన్యమై యున్నను జూచి యత్యంత
దైన్యంబునొంది యా ధరణీశ్వరుండు
నందఱుఁ దనదూఱ నతిఖిన్నుఁడగుచు
సౌందర్యనాథుని సన్నిధి నిల్చి
యందందఁ బ్రణమిల్లి హస్తముల్ మొగిచి
పొందైన వేడ్క నింపుగ సన్నుతించె

శ్రీ సహ్యాదరధర శ్రీ జటాజూట !
శ్రీసూనహరణ ! యో శ్రీ నీలకంఠ !
హరి విధినుత పాద ! యఖిలప్రమోద
కలకంఠ ! సర్వేశ ! కామితఫలద
యో భక్తజనరక్ష ! గో విరూపాక్ష
యో భూతగణనాథ ! యో చొక్కనాథ !
నా రాజ్యమునకు నానలు లేనియట్టి
కారణంబేమి యో గరళాస్య భూష !
క్షామమ్ము చేతను జాలంగ నొచ్చి
యీ మహీప్రజ లెల్ల నిచ్చోటు విడిచి
పోయిరి యన్యభూపుల కిందు కేమి
నేయఁగఁగలవాఁడఁ జెప్పవే ! దేవ !
యని సన్నుతులు సేసి యా పాండ్య విభుఁడు
తన నగరికిఁ బోయి తగ నిద్రవోవ
నా రాత్రి స్వప్నమ్ము నందు విచ్చేసి
యా రాజధరుఁడు నిట్లని యానతిచ్చె
వేదంబులును మాకు విమలరూపంబు
వేదస్వరూపంబు వెలయంగ మేము
తగ వేదములకెను దల్లి గాయత్రి
మనుజేంద్ర ! యిటు మహామహిమలు వెలఁగు
నట్టి వేదములు గాయత్రియుఁ గలుగు
పట్టు పాఱులు లోకపావనాకృతులు
మఱి బ్రాహ్మణులు దైవమన వేఱుగలదె !
ధరణికి విప్రులు దైవమ్ము లనఘ !
అధ్యయనమ్ములా ప్రాహ్ణ పరాహ్ణ
మధ్యాహ్నకాల సంప్రాప్తి నేమలక
నిత్యకర్మము లహర్నిశము బ్రాహ్మణులు
సత్యవ్రతమ్ముగా సల్పుట వలన
దేవతలందఱు తృప్తులై వారు
భూవలయంబు సొంపుగఁ జేయుచుండఁ
గాలమ్ము దప్పక కడఁగి వర్షములు
కాలంగ వర్షించి సస్యమ్ము లెసఁగఁ
పాడియుఁ బంటయుఁ బరగ నే ప్రొద్దు

పోఁడిగా నుండును భూతలం బెల్ల
మనుజేశ ! నీవు బ్రాహ్మణుల రప్పించి
తనరంగ ఘనదాన ధర్మముల్ జేసి
వారి సంతృప్తిగా వరుస రక్షించి
గారవంబున వారు కర్మముల్ నడప
వర్షముల్ గలుగు నీ వసుధ యంతటికి
నరనాథ ! పాడిపంటలు చాలఁగలవు
ధనములేదని మన స్వాంతంబు వలదు
ఘనముగా నీకు నక్షయజోలె యొకటి
యేమొసంగెద మది యెందఱికైన
వేమాఱు నర్థమ్ము వెచ్చఁబెట్టినను
నుడుగక బహుధనంబొసఁగు నీ జోలె
పుడమీశ ! ప్రజలను బ్రోచి భూసురుల
రక్షించు దానధర్మములచే ననుచు
నక్షయజోలె నాహరుఁ డొక్కటిచ్చె
నప్పుడు తన మంత్రులందఱి వేగ
రప్పించి సంతోష రసపూర్ణుఁ డగుచుఁ
దనకు నారాత్రి సౌందర్య నాయకుఁడు
జనుల రక్షింప నక్షయజోలె యొసఁగు
విధమెల్లఁ జెప్పి యా విశ్వేశుఁ బొగడి
మధురాపురీ పాండ్య మండలేశ్వరుఁడు
నా జోలె గంధపుష్పాది ధూపములఁ
బూజించి వితరణ స్ఫూర్తి శోభిల్ల
మహిలోనఁ గల్గు బ్రాహ్మణుల రావించి
బహుదాన ధర్మముల్ పరగంగ నిచ్చి
దనరంగఁ బ్రణతి సత్తాత్పర్యుఁడగుచు
ఘనముగా వారి షట్కర్మముల్ నడపె
పరగ మాహేశ్వరభక్తిఁ జెన్నొంది
పరమధర్మ ప్రీతి పాలుఁడై వెలసె
నారాజ్యమున నెపు డధికవర్షములు
మీఱి ధాన్యములు సమృద్ధిగాఁ బండి
యేమిటఁ గొఱలేక యెల్లభాగ్యముల
నా మధురాదేశ మంత వర్ధిల్లె

నా సౌందరేశ్వరు ననుమతి వలన
వేసారకెంతయు వెచ్చఁబెట్టినను
గడమ గాకా జోకె ఘనముగఁ ధనము
నడుగక వర్థిల్లుచుండె నెక్కుడును
శ్రీ చొక్కనాథుని సేవ మాహేశ్వ
రాచారభరిత బ్రాహ్మణ భక్తి గలిగి
ఘనతరైశ్వర్య సంతానుఁడై పాండ్య
జన పాలవగుఁడు రాజ్యము నేయుండె
నిదియుఁ ద్రింశల్లీల యిటుమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మానులార వినుడీ
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె॥

## ముప్పది యొకటవ లీల

ఆపాండ్య భూపాలుఁ డధిక ధర్మ ప్ర
దీప్తుఁడై సకలధాత్రీతలంబేల
కాలమ్మునను దారుకావనమ్మునను
స్త్రీలును దామును నంచిత తపోధనులు
మునులుండు రందు నా మునిపత్నులెల్ల
నెనయంగఁ దమకును నీడు జోడైన
పరమ పాతివ్రత్య భవ్యచారిత్రు
లరయ లేరనుచు నహంకరించినను
శ్రీ చొక్కపతి ఋషిస్త్రీల పతివ్ర
తాచారములు నూతముసి యాత్మఁదలఁచి
చిగురు కెంజడలును జిలుగు చందురుఁడు
మిగులుగన్నను గటిమీఁది సూత్రమ్ము
నడిమి యొడ్డాణమ్ము నాగజన్నిదము
మెడకప్పు సంకును మేని భూతియును
బసిఁడి పావాలు జపతుమాలికయు
భసిత త్రిపుండ్రంబు ఫాలభాగమునఁ
గాలియందెయుఁ జంక కత్తుసాలయును
చౌలఁ గామాక్షులు చేత శూలమ్ము
పులితోలు గోణము పునుక కంచమ్ము
గలిగి సమ్మోహనాకార వేషమున
ధవళశంఖములు మింపటి ఘోరుకాలుకు

నవ్యమైన భిక్షాటన క్రియతోడ
మూఁడుమూర్తుల కాదిమూర్తైన వేల్పు
మూఁడులోకమ్ముల ముదముతోఁ జూచి
యా దారుకావనాభ్యంతరమ్మునకు
నా దైవతాధ్యక్షుఁ డర్థితో వచ్చి
భిక్షయటంచును ప్రేమతో లోక
రక్షణుండటను సంభ్రమలీల నడిగె
భిక్షాంప్రపత్త ! మే పీన చక్రాంగ
వక్షోజయుగళ యౌవనలార ! భిక్ష !
దారుకావనవాస తాపసోల్లాస
తారుణ్య విభవసుందరులార ! భిక్ష !
గజ జలంధర యంధక వ్యాఘ్ర మదన
అజశిరఃపురదైత్యహరునకు భిక్ష !
దివి భువి కీలాల తేజ ? స్సమీర
రవిచంద్రయాజి విగ్రహునకు భిక్ష !
జాతిభేదము లేక సద్భక్తు లకును
ద్రాతైన మోక్షప్రదాతకు భిక్ష !
కాలకూటాగ్ని లోకమ్ము లీరేచు
కాల నీయని కాలగళునకు భిక్ష !
యని యివ్విధంబున నా జంగమయ్య
మునిపల్లెలో భిక్ష ముషుకొని వేఁడ
నప్పుడు మునిపత్ను లతిసంభ్రమమున
గొప్పులు వీడంగఁ గుచము లల్లాడ
భిక్షమ్ము వెసఁదెచ్చి పెట్ట వచ్చినను
కక్ష యుగ్మముజూడఁ గప్పెర చెయ్యి
పొడవెత్తి భిక్ష మప్పుడు పెట్టువేళఁ
గరమూల రుచులు శృంగార హస్తములు
కఱకంఠుఁడటుఁ జూచి కడకంటు నగిన
నతని సౌందర్య మొయ్యారమ్ముఁ జూచి
మఱి విభ్రమించి యేమఱియున్నవారు
భిక్షమ్ము దెచ్చియుఁ బెట్టంగ మఱచి
యక్షీణమోహితలై యున్న వారు
మఱికొంద ఱతివల మ్మాయల తపసి

మరులచూపుల మేనుమఱచిన వారు
పయ్యెదజాఱిన బ్రమసి పాలిండ్లు
మ్రొయ్యగాలేక మోములు జూచువారు
పెట్టియు మఱచియుఁ బెట్టలేఁడనుచుఁ
జట్టువన్నెలను భిక్షము దెచ్చువారు
నైరి యా మునిపత్నులందఱు నపుడు
నీరీతి మునుఁగొని యిందుశేఖరుఁడు
వాడల వాడల వరుసతోడుతను
వేఁడుకతో భిక్ష వేఁడి యాసతుల
మదిలోన నెంతయు మరులు పుట్టించి
మదనారి యచటను మాయమై చనియె
నంత నామునిపత్నులందఱు విరహ
సంతాపములఁ జిక్కి జాడలు దక్కి
మతివిచారమునించి మానముల్ డించి
పతులసేవలు మాని భ్రమలను బూని
కరములుడస్సి యాకరములు గ్రుస్సి
కరముల గాజులొక్కట నూడిపడియె
నా ఋషులెల్లను నతివలఁ జూచి
మీర లాసర్వేశుపైఁది మోహమున
గడు జిక్కి చేతుల గాజులువీడి
పడియెఁ బతివ్రతా భావమ్ము సడలి
మఱి పోయి మీరలా మధురలోపలను
గరమొప్ప వైశ్యుల కడుపునఁ బుట్టు
డని శాపమిచ్చిన నా యింతులెల్ల
మునుల వీక్షించి మిమ్ముల నివ్విధమున
శపియించినను మాకు సద్గతి యేది
కృపగల్గి మమ్ము రక్షింపరే ! యనిన
నా ఋషులిట్లని రా సెట్టులకును
మీర లాపురిని జన్మించియుండినను
మఱికొన్ని తిథుల కమ్మధురేశ్వరుండు
నరయ గాజులసెట్టియై యందువచ్చి
యాజటాధరుఁడు మీహస్తముల్ పట్టి
గాజులుపెట్టినఁ గలుగు మోక్షమ్ము

లనినను ప్రియమునఁ యట్లకాకనుచు
జనియించి రా వైశ్య సంతతులిండ్ల
పెరుగుచునుండిరి పెక్కువల్గలిగి
యయ్యెడఁ బెండ్లి ప్రాయములైనఁ జూచి
యియ్యాకుబిడ్డల నెవ్వరి కిత్తు
మని సెట్టివర్గము లటు విచారింప
మనసిజదమనుఁడు మధురేశ్వరుండు
చొక్కనాయకుఁడు గాజులసెట్టి యగుచుఁ
జక్కఁగా ముతుకవేషముతోడఁ జల్లి
పట్టుసూత్రఁపుత్రాళ్ళ పైఁడుంగరములు
బెట్టుబసవనిఁ జేసి పెట్టినముద్ర
పట్టువస్త్రముగూర్చి బాగుగా బిగియఁ
గట్టినదేవుండు కంఠాన నమర
నొసలను వీభూతి నునుపుగాఁ దీర్చి
యొసపరి పెండి కట్లారపుగాఁ బెట్టి
సన్నఁపు రుద్రాక్షసరములు వైచి
పన్నైమీఱఁగను దోవతికట్టు కట్టి
పైమించు గజముపచ్చళి పచ్చడంబు
వామాంగమున వల్లెవాటుగా వైచి
నెఱిమించు తలపాగ నేర్పుగాఁ జుట్టి
కరముప్రవేళ్ళ నుంగరములు వెట్టి
బుజముపై గాజులపాపి చాలఁబెట్టి
భుజగేంద్రభూషుండు పురవీథులందు
గాజులుబొద్దులు కమ్మదుద్దులును
గాజులుగొనరారొ ! గాజులో ! యనుచు
పచ్చలుబూదెలు పచ్చరంటాకు
పచ్చలు పొన్నాకు పచ్చగాజులును
నీలాలు మఱిపట్టు నీలాలు రంగు
నీలాలు పచ్చల సిగ్గుగాజులును
ఆవపూవన్నె రాజావర్తనములు
గోవాళసరములు గొమ్మనంబులును
పువ్యగగాజులు పొన్నపూచింత
పువ్వులు సంపెంగిపూ చామపువ్వు

పొగడగాజులు జొత్తిపోతుపన్నియలు
చిగురాకుతేనెలు జీనిగాజులును
గలవు మాకడ ననేకములైనవగలు
వలసినవారికి వలసినవన్నె
గాజులు దొడిగెదఁ గన్నెప్రాయంపు
రాజీవనయనలు రారో! యటంచు
మాధుర్యపురరాజ మార్గముఁబట్టి
వీధివీథులసెట్టి వేడ్కతోఁ దిరుగు
నప్పుడువైశ్య కన్యాంగనామణులు
నొప్పులకుప్పలు నుడురాజముఖులు
తలవాకిటికిని నంపలు వేగవచ్చి
కలకంఠకోమల కంఠస్వనములఁ
గావరంబెసఁగ నో గాజులసెట్టి
రావో! యటంచును రమణతోఁ బిలిచి
గాజులెన్నెసి? యాకకుఁ జెప్పు మంచి
గాజులు దొడుగు నీకల లెక్కలిత్తు
మనినను నాసెట్టి యప్పుడు నొయ్యార
మునను గంబళివైచి బుజమునఁ బొసెయుఁ
గంటిపైఁ బెట్టి కరములభూష
ణంబులన్నియు నూడ్చి నవ్యమోహనుల
చే నైటికలుదీసి చేతులు పిసికి
ఘనగాజులను జేర్చి యటుజోడు గూర్చి
పడుచుల కెల్లను భాషములెక్కఁగఁ
దొడిగెను వారిచేతులు నొక్కినొక్కి
యప్పుడా బాల లొయ్యారంబు తోడ
నప్పురాంతకునకు నాకవుట్టింప
కటియుగ్మంబుల కాంతులు జెరసి
వక్షోజముల మీఁద వయ్యారిఁ గదల
నిటలభాగమ్మున నెరసి తూలాడఁ
గుటిలకుంతలములు గొళ్ళదువ్వుచును
ముదిరిన కట్టాణిముత్యాల సరులు
కొదమగుబ్బలను పైకొని వ్రేలుచుండ
మొలకచన్నుల మీఁద మోహనరుచులు

జిలుఁగుపయ్యెదలోనఁ జిక్కక వెడల
నాటలతేఁటలు మరుల చూపులను
ఓటిగాజులు కొత్తెరో సెట్టి యనుచు
మంచిగాజులుగావు మఱి వేఱె తొడుగు
మంచు సెట్టితో మేలమాడెడువారు
ముదిసెట్టి యీగాజు ముంజెయ్యి దాటు
వదులు నీగాజులు వద్దనువారు
తట్టు నీలములొక్క తరముగా నేరి
మట్టుచూచుచుఁ దొడుగుమా యనువారు
గోవాళ్లములు మాకు గోత్రముల్ గావు
ఆవపూసగ యేరు మనియెడువారు
చిగురాకు కెంపులు చే బిగువనుచు
పగులఁగొట్టదని పైఁబడ వేయువారు
పగిలినగాజుల పైఁడి యిచ్చెదము
జగడమేలని సరసములాడువారు
నేఁడు చేతనులేదు నీగాజులకును
బైఁడి రేపిచ్చెదఁ బద మనువారు
నాసెట్టి మాయింట నొకపూటనైన
బోనేసి నేఁడుండి పొమ్మనువారు
నీచేతగాజులు నెక్కుడో! యనుచుఁ
జూచికొమ్మని చేయిఁ జూపెడివారు
వెలకొల్ల నిస్సి దీవెలగాజు మాకుఁ
గలదు పెట్టుకొనుచుఁ గైపెట్టువారు
చొక్కనాయకుఁడు గాజులసెట్టియైన
ముక్కుగాజిడకపోవో యనువారు
నతని మాయలఁ జిక్కియా యింతులెల్ల
ధృతితోడఁబోలేక తిరిగితిరిగియు
గాజుల నిడుమంచుఁ గాంక్షలుప్పొంగ
నోజతోఁ బోలేకయున్న యత్తఱిని
నాసెట్టులంత మాయఁపుగాజులమ్మ
నీసెట్టి వచ్చినాఁడెవ్వఁడో యనుచు
నీ పేరెవ్వరు నీది యేభూమి
యీపడుచుల యిండ్లకేల పోయెదవు

అనినను నేను బాల్యమునందుఁగాశి
చని గంగలోపల స్నానమ్ముఁజేసి
యీ కన్నియకుమారి నీతీర్థ మాడి
చేకొనిపోవుచుఁ జెలఁగి యీచిన్న
పడుచుల గాజులు బాగుగా నేరి
తొడుగుచున్నాఁడ వృద్ధుండ నాపేరు
చొక్కసెట్టని చెప్పుచును వారిఁ జూడ
నక్కజమ్ముగ నాయమస్యా నావేళ
నంత నాబాలల హరుఁడు చేపట్టి
నంత సద్యోగర్భమైనను జూచి
యావైశ్యులెల్లరు నత్యంత మడలి
బాపురే! యపకీర్తి వాటిల్లె నిపుడు
తమవంశములను నింపలు పుట్టిననుచుఁ
దమకులాంగనలును దారు కన్యలను
నగ్నిప్రవేశమయ్యెడఁ జేతు మనుచుఁ
బ్రజ్ఞవాటించిరి భ్రమసి యాసెట్లు
నప్పుడాస్వామి దయాపరమూర్తి
తప్పని భక్తవత్సల ఖ్యాయణుఁడు
ఫలియంచినామక భవ్యదాయకుఁడు
నలువొప్ప శ్రీచొక్కనాయకుం డపుడు
మిక్కిలికంటితో మిన్నేటితోడఁ
జక్కనిభూతితో శశిరేఖతోడ
నాగచర్మముతోడ నగజాతతోడ
భోగికంకణములతోఁ బులితోలుతోడ
నావిలుతాశననేత్రుఁ డప్పుడు నంది
వాహనారూఢుఁడై వైశ్యుల యెదుట
నత్యంతభక్తితో నసురులు గొలువఁ
బ్రత్యక్షమయ్యె నా పరమేశ్వరుండు
నప్పుడావైశ్యులు హరునకు మ్రొక్కి
తప్పనిభక్తితోఁ దగఁ బొగడి రపుడు
గజరక్షణార్చిత! గజవక్త్రజనక!
గజరాజసంరక్ష! గజరాజశిక్ష!
ఘోరపాపకదూర! కుండలిహార!

హారహీరశరీర ! యఖిలప్రపూర !
సురగణాసాధ్య ! భాసురగణారాధ్య !
కరిచర్మపరిధాన ! కరుణానిధాన !
నిరుపమధరచక్ర ! నిపుణనిర్వక్ర
తరపరాక్రమశీల ! దమితాఘజాల !
విధి శిరోమాలికావిభ్రమాభరణ !
మధురాపురీశ ! నిర్మలచొక్కనాథ !
నీ రూపుఁ బొగడఁగా నేరవు శ్రుతులు
నీ రూపుఁ బొగడంగ నేరఁడాయజుఁడు
నీ రూపుఁ బొడగాన నేరరు సురలు
నీ రూపుఁ బొడఁగాన నేరరు మునులు
నని యివ్విధంబున నభినుతుల్ సేయ
మనమునఁ గరుణించి మదనాంతకుండు
శ్రీకరమ్ముగను నా సెట్ల కిట్లనియె
మీకులమ్మునను నేమియు నింద లేదు
మును దారుకా వనంబునకును నేను
చని వేడ్కతోడ భిక్షము వేడినంత
నా మునిభామినులందఱుఁ జూచి
కామింప వారిచే గాజులూడినను
మునులు కోపించి యీ పురి సెట్ల గర్భ
మునఁ బుట్టుడనిన నా మునిపత్ను లెల్ల
మీయందుఁ బుట్టిరి మీకులంబెన్నఁగ
మాయనుగ్రహమున మఱి గర్భమైరి
ఏ కళంకము లేదు నీ బాలలందు
నీక్రూరవధ మీకు నేల పాటింప
మేము నే వెంటను మీవంశమునను
ప్రేమతో నొకబాల పెండ్లియాడెదము
చింతింపవలవని శివుఁడానతిచ్చి
సంతోషమున నదృశ్యంబయ్యె నంతఁ
గులమువారల కెల్లఁ గోర్కెలు సెలఁగఁ
దెలిలేమి భాగ్యమ్ముఁ జేసిరో యనఁగ
మృదునియంశమ్ములు మేకొని దాల్చి
కడువేడ్క బిడ్డలఁ గనిరి యాసతులు

నై యన నాబిడ్డలు నైదిగో యాస్వామి
కొనర సేవలుసేయు మంటె రిపుహరిని
నీశుఁడంకెను నింతి నింక చొక్కతెను
నా సెట్టి యిండ్ల బెండ్లాడుచు నపుడు
ఆకన్యకామణు లపరజన్మమునః
శ్రీకంఠకృపగ్గ చిరతపోధనుల
కాబుఋషులకుఁ బత్నులై కోటియుట్ల
దారుకావనమునఁ దగనుండ రంత
నిదియు ముప్పదియొందు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి

## ముప్పదిరెండవ లీల.

ఆనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె
ఫాలాక్షుఁడొకనాఁడు ప్రమథులతోడ
కైలాసగిరి మీఁద గనక గర్భాది
సకలదేవతలెల్ల జయజయధ్వనుల
వికసితవదనారవిందులై కొలువ
లీలమై నపుడు ఘళీమంటపమున
నావేళఁ గొలువుండి యమ్మహాత్ముల కు
శైవాగమాది శాస్త్రము లానతిమ్మ
నాతఱి షాణ్మాతు లార్యులు జడలు
భూతియు రుద్రాక్షములు ధరియించి
యత్యంతకౌతూహలాధ్యక్షులగుచు
శ్రుత్యుక్త విధుజూచి శుభ్రవర్ణాంగు
నశ్వరమాత్ముని నర్థిఁ బూజించి
తప్పక భక్తితాత్పర్యము మీఱ
దేవ ! సర్వేశ్వర దేవాదిదేవ !
దేవతాధిష్ఠాన ! త్రిపురసంహార !
సనకసనందనాద్యనిమిషలోక
మునిగణవందితమూర్తిత్రయాత్మ !
అంబికాహృదయేశ ! అంబరకేశ !
శంబరారిధ్వంస ! చంద్రావతంస !
హాలాస్యేశ్వర ! యొకవిన్నపమ్ము

మాయెడ దయయు సన్మానమ్ము గలిగి
నట్టి మహాసిద్ధు లనువంద మాకు
నిష్టమై యుపదేశ మిచ్చి రక్షింపు
సకలార్థతత్త్వజ్ఞ ! సకలలోకాజ్ఞ !
సకలతత్త్వజ్ఞాన ! సచ్చిదాకార !
యని సన్నుతులు సేయ నభవుండు మెచ్చి
వినుఁడని వినిపింప వినకను వారు
నావేళ వేఱె పరాఙ్ముఖులగుట
భావించి వారి యాభావమ్ము దెలియ
నప్పుడు తబ్బిబ్బులై యానతిచ్చె
నప్పుడెఱుఁగక వార లట్లై భావింపఁ
గోపించి యాయాఱుగురిఁ జూచి యేను
దీపింప మీ కుపదేశమ్ము సేయ
చుండఁ బరాకులై యుండుటఁ జేసి
పాండ్యమండలమునఁ బట్టి మంగళము
నని యొప్పు గ్రామంబునందుఁ బెంపొందు
ఘనమైన యొక యుత్తి కలదందు క్రింద
మీరార్గురును నట్టి మేటివృక్షమ్ముఁ
జేరి తారూపులై చెందుఁ డచ్చటను
నని శాపమిచ్చిన నతిభీతిఁ బొంది
తనర నాస్వామికి దండప్రణామ
ములు జేసి ఫాలాగ్రమున మోడ్పుచేతు
లలరంగఁ జేర్చి యాయతివరులిట్లనిరి
యోస్వామి యపరాధ మోర్చి యీయెడను
నోస్వామి దాసులమైన మాయందుఁ
గరుణార్ద్రదృష్టిచేఁ గరుణింపు దేవ
మురభంజనప్రియ ! ముదమొంద మాకు
నదిగాక సర్వాత్ముఁడైన నీవెందుఁ
గొదలేకయుంట మాకును జంపలత్వ
మొందఁగల్గిన నేమి యొల్ల జీవంబు
లందు మీరుండుట లది సందియంబె
జీవుండు శివుఁడును శివుఁడు జీవుండు
నావార్త వినమె యామ్నాయమ్ములందు

నని వారు ప్రార్థింప నమ్మహేశుఁడు
మనమున హర్షించి మఱి వారి కనియె
నా పాండ్యదేశ మధ్యాంతమ్మునకును
బ్రాపించు మధురాపురమ్ము లోపలను
జొక్కనాథుని పేర సొబగొంద వచ్చి
యక్కడ మీశాఖ మిటఁ దీర్చవైతుఁ
జనుఁడన్న వారలు సద్భక్తితోడఁ
దనివొంద సాష్టాంగదండప్రణామమ్ము లొసఁగి
యాదేవు ననుమతి నవని కేతెంచి
యాపాండ్యరాజ్యమ్ము నందు నావర్తి
దారుణభూత భేతాళ డాకినులు
ఘోరమై తనయందు ఘూర్ణిల్లుదాని
భల్లూకశార్దూల పన్నగతతు
కెల్ల నావాసమై యొసఁగినదానిఁ
జిక్కనై శాఖోపశాఖల నష్ట
దిక్కులు నొరయంగ ధృతి మించుదాని
నత్యున్నతమ్ముగా నాకాశ మంటి
నిత్యనిత్యమువచ్చి నిర్ఝరాంగనలు
వెలయంగ యోజన విస్తారమైన
దళముల శయనింపఁ దనరిన దాని
నూడల నహికన్యలుయ్యాల లూగి
యాడంగఁ బాతాళ మంటినదాని
వడిమించియున్న యాపట మటుఁ జేర
వడఁతులు నార్గురు పాషాణరూప
లై దాని క్రిందట నత్యున్నతముగఁ
బ్రోదిగా నున్న యప్పుడు మఱికొన్ని
కాలమ్ములెన్నేనిఁ గడచిన పిదప
ఫాలాక్షుఁడా మహాభక్తవాత్సల్యుఁ
డటుస్వామి చొక్కనాయకమహాదేవుఁ
డటకును గురురూపమై యేగుదెంచి
నంత శిలారూపులై యున్న యార్గు
రింతులై తొల్లింటి యేప్రభావంబు
లాప్రభావంబుల యవతారమందు

నా ప్రమథాధ్యక్షు నగ్రభాగమున
నిలచి సద్భక్తిని నిటలప్రదేశ
మునను హస్తాంభోజములు జేర్చి రంత
జయజయ భూతేశ ! జయతు సర్వేశ
జయ శుభ్రవర్ణాంగ జయ యభ్రకేశ
జయ హరిసంరక్ష జయ రిపుశిక్ష
జయజయ మహాదేవ జయ దేవదేవ !
బాణవత్సల పంచబాణసంహార
ఏణాంకఘనజూట ! యేనడుచ్చాటి
యాగమశాస్త్రేతిహాససంకాశ
వేగావతీవేశ ! విమలసర్వేశ
వ్యాఘ్రచర్మాంబర ! వరదయాలోల !
శీఘ్రమ్ముగా నిష్టసిద్ధి మాకిపుడు
నని సన్నుతించిన నమ్మహాదేవుఁ
డనువందఁ గృపతోడ నటు వారిఁజూచి
మఱి యణిమామహిమాగరిమాదు
లరయంగ లఘిమయుఁ బ్రాప్తి ప్రాకామ్య
మీశత్వము వశిత్వ మింపొంద నష్ట
మా సిద్ధిఁ దెలియంగ మఱి యానతిచ్చె
నేచొక్కనాథుండ నెమ్మి నీమధుర
నాచరింతుము నేము ననుచు నాదేవుఁ
డంత నంతర్ధానుఁడయ్యె నాస్వామి
సంతోషమంది యాశ్చర్యమ్ము నంది
యీ శిలారూపమ్ము లీయింతు లౌట
నాశివు నానంద మట్టిదే కాదె
యని సన్నుతింపుచు నమరులు మునులు
ఘనముగాఁ గొలిచి రక్కడఁ బుష్పవృష్టి
యప్పు డాయార్గులు నతివలు వేడ్క
నొప్పుగా సౌందర్య సుపదేశ మాత్మ
గీలించి యెంతయు ఖేచరమార్గ
మే లోకమున కెప్పు డెగుచుండుదురు
పూని యీ లీల యెప్పుడు విన్న పుణ్య
మానవులకు ననుమానంబు లేక

చతురబ్ధిమధ్యభూస్థలి నెల్ల నేలి
ప్రతిలేని సౌందర్యపదవిఁ జెందుదురు
ఋషులార! యిది యు ద్వాత్రింశతిలీల
ధిషణవిస్తారు లాది మునీంద్రు లపుడు
నా యగస్త్యుని గొల్చి యటమీఁది చరిత
లాయతభక్తి నూ కానతిమ్మనిన
విని సర్వఘన సత్కవీంద్ర పాదాబ్జ
విదిత పూజామోద విమలాంతు పచ్చ
కప్పుర సౌరభ్య కలితమానాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్ముగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణ కావ్య సత్కవీంద్రాభి
నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
మందున నిది పంచమాశ్వాసమయ్యె ॥

---

# షష్ఠాశ్వాసము

## ముప్పదిమూఁడవ లీల

శ్రీకర కరుణార్ద్ర శ్రీరామభద్ర
రాధాసుతత్యాగ రంజి నా భాగ
భాగీరథీ వంశ పావనోత్తంస
రాగదోషవిముక్త రణజయాసక్త
ఒసవభూవర పుత్ర ! భాగ్య చారిత్ర
పాసఁగఁగఁ జినరామ భూపాగ్రజాత
వినుగోళ్ల పెదరామ విభవసుత్రామ !
యనుపమ జయధామ ! యధికసత్ప్రేమ !
ఘటజన్ముఁడా మౌనిగణముల కపుడు
నటమీఁద చరిత మిట్లానతి యిచ్చె
నంత నా పాండేము హాలాస్యపురము
నంతయు వేడ్కతో నేలుచున్నంత
నటకును గాస్పెట్టి యను నొక్క రాజు
నిటలాక్షు సద్భక్తి నియమమ్ము పూని
పొలుపొంప నా దేవుఁ బూజింపఁ గోరి
వెలుపడి వచ్చె నా వేళ దండెత్తి
వచ్చిన నంపు నా వైఖ ప్రవాహ
ముచ్చోట నడ్డమై యద్భుత బెసఁగ
సాంగంబులను మించి ఘూర్ణిత ధ్వనుల
లాలితఫేన జాలమ్ముల నెలసి
కడు నున్నతమ్ముగా గగనమ్ము నొరయ
నెడలేని యూర్ములయ్యోడ ముక్తి సతికెఁ
బరగంగ సోపానపఙ్క్తులు గాఁగ
మఱి సుళ్ళచేతఁ గూర్మము గానరాఁగఁ
దుంపిళ్లు గుఱియయు నుండఁ దొడరి సౌందర్య
సంపున జనలోకపావనంబైన
యా పుణ్యనది పాఱు నందందఁ జూచి
ప్రాపించుఁ దన పాపపటలమ్ము లూడ్చి
యట నుత్తరంబైన యా యేటివఱిని
దటుకున నడిసె నంతయు దండువచ్చి
విడిసినఁ గాండ్స భూవిభుఁడు చింతించి

బంధురధ్వాంతవ్యాప్తి ప్రబలె నంతటను
నంధకారము విచారాంధకారమ్ము
గప్పి తెలియకయున్నఁ గాడ్వెట్టి కెలమి
నప్పుడా స్వామి కృపావేశుఁడగుచు
నేఁటి కవ్వల నొక్క యేకమ్ము కన్ని
దాఁటించి యా పాండ్యధరణీశు ముద్ర
నత్తఱి జరుపరాదు మను నందు
నుత్తరప్రాకార మొయ్యన నొక్క
చోటు వాకిలిఁ దీసి చొరనిచ్చి యతనిఁ
బాటించి యా రాత్రి పగలు గావించి
సౌవర్ణ సరసిలో స్నానమాడించి
దేవేంద్రుఁ డిచ్చిన దేదీప్యమాన
దివ్యవిమానమ్ముఁ దెలియంగఁ జూపి
భవ్యమౌ తన మూర్తి భావింపఁజేసె,
నప్పుడా కాడ్వెట్టి యానంద మంది
తప్పని భక్తితోఁ దాత్పర్యమెసఁగ
వెలయంగఁ బదియాఱు విధముల పూజ
లలరంగఁజేసి తా నభినుతుల్ జేసె
నో దయాపరమూర్తి ! యో యాత్మకీర్తి
యో దేవ ! మహదేవ ! యో సర్వదేవ !
స్థావరజంగమ సంహార హృదయ
యో చిన్మయానంద ! యోగీంద్రవంద్య !
శ్రీ చొక్కనాయక ! శ్రీ మహాదేవ !
నీ పాటవీగేహ ! నిర్మలదేహ !
నీ పాదసేవచే నినుఁ జూడఁగంటి
నని తన్మయావస్థుఁడై యప్పుడంతఁ
దనుదానె మఱచును దనుదానె తెలియు
నీ ప్రకారమ్ముగ నెంతేని వేడ్క
నా ప్రమథాధీశు నర్థితోఁ బొగడె
నంతఁ గాంతారసంహారకుఁ జూచి
కంతుసంహారుండు కరుణించి యపుడు
నతని సద్భక్తికి నాత్మలో మెచ్చి
యతఁడు కోరిన వరములన్నియు నిచ్చి

తులదూఁగు పాండ్యుని తోడి యుద్ధమ్ము
లరఁ గావింతు న నరుగుదె చిలివి
యట్టివాఁడు యరాని వైన నీ కిపుడు
గట్టి మూకలు లేవు గావున నిపుడు
సమరమ్ము నతనితో సలుపంగలేవు
క్రమముతో నీ రేయి కపిలు బువ్వాలికి
ననుచు నాతని నేఁటి యవ్వాలి కనిచి
తనర నా వాఁకిటఁ దగ జనుపాంద్ర
పెట్టినఁ గనుగొని వెర్చి యా రాజు
పెట్టు కావలి వెల్ల బెదరి యావేళ
భయమునంది వచ్చి యా పాండ్య భూపతికి
రయముతోఁ జెప్ప సంభ్రమలీల నతఁడు
వేవేగఁ దన మంత్రివినతులతోడ
నా వేళఁ జనుదెంచి నంతయుఁ జూచి
మతి చొక్కనాథుని మహిమ యిది గాక
తరుసతో నిది యెట్టివారికి వశమె!'
యనుచు నాశ్చర్యుఁడై యా పాండ్యవిభుఁడు
మనమునఁ జింతించి మఱి యూ నిట్లనియె
నో దేవ! యిటు సేయ నుచితమే నీకు
నాదు దాయాదికి నయమీయఁ దగవె?
యనుచు నా రాజేంద్రుఁడా రాత్రి చింతఁ
గనుమూయ నాతని కలలోన నపుడు
సౌందర్యనాయకస్వామి విచ్చేసి
యిందుకు సంతాపమే! భూపాల!
నతఁడు నా మీఁదను నతిభక్తుఁడగుట
నతనికిఁ జూపితి నతఁడు దెలియ
నని యానతిచ్చిన నతఁడు మేల్కాంచి
తన మంత్రులకుఁ జెప్పి తగ వేడ్క నుండె
వేగ నా కాంతార విచ్ఛేదకుండు
సాఁగెను తనను రాజ్యమునకు నంత
నీలీల విన్నను నేమితోఁ బ్రాయఁ
జాలంగఁ బఠియించు సద్భక్తులకును
నారణ్యభయము జన్మారణ్యభయము

దూరమై సద్భక్తి త్రోవఁ బొందుదురు
ఇదియు ముప్పదిమూఁడు నిఁటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.

## ముప్పదినాల్గవ లీల.

అనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియెఁ
వరగ నాహాలాస్య పట్టణస్థానను
పరుసలోఁ బాండ్య భూవరుఁడు సొంపెక్క
సౌందర్యనాథుని సద్భక్తిఫలనఁ
పొందుగా నా పాండ్య భూపాలకుండు
పొగడంగఁ దనజాతి పొలఁతుల యందుఁ
దగఁ బెండ్లియాడ కొంతయు వెద్కతోడ
కామాంధుఁడై వారకాంతల నందుఁ
గామించి పెండ్లాడి కాలమ్ముగడప
చుండుచోఁ జోడ భూజోత్తమాహ్వయుఁడు
పాండీనితోడి సంబంధమ్ముకొఱకు
మాకుమార్తెను మీకు మనువుగా నిత్తుఁ
గైకొమ్మటంచును గడఁకతో మీర
లన్నరనాథుని యగ్రభాగమున
విన్నయఁ దెలియంగ నెఱిఁగింపఁ జేసుచు
తలఁపుగఁ దనదు దూతలతోడఁ జెప్పి
పొలుపొంద హాలాస్యపురికిని బంపె
నా పయి వారలు నతివేగఁ బోయి
యాపాండ్యభూవరునకు విన్నవింప
నా వార్త లాతని యనుజన్ముఁడెఱిఁగి
వేవేగ నాచోళవిభుని రాజ్యమున
కేఁగి నీపుత్రిక నీపంపు మాకు
లొఁగక చోళ భూలోకేశ ! యనిన
నతఁడు నాతనితోడ నని సేయ వోడి
ధృతిలేక నాకుమార్తెను బెండ్లిచేసెఁ
జేసిన నాపాండ్యశేఖరాత్మజుఁడు
రాశికెక్కిన చోళరాజును గూడి
తెలివంద నుత్తరదేశాధిపతుల

దళతంత్రములతోడ ధర గ్రక్కటిలఁగఁ
దమయన్న పాండ్యభూతలపతి మీఁద
గమకమ్ముగా దండుగదలె నత్తఱిని
నారాక యెఱిఁగి పాండ్యావనీశ్వరుఁడు
గోరి సౌందర్యుని గుడి కేగుదెంచి
యోభక్తమందార ! యోచొక్కనాథ !
ఓభర్గ యోయుగ్ర యోనీలకంఠ !
గానైకలోల ! శ్రీకరుణాలవాల !
యట చోళభూకాంతుఁడా యుత్తరంబు
పటుతరసేనాధిపతులను గూడి
నామండలంబెల్ల నాతమ్ముఁడిట్టు
నామీఁద దండెత్తి నడుపుచున్నాఁడు
యోకృపాంభోరాశి ! యొకఁడ నే డాసి
చేకొని యుద్ధమ్ము సేయ నావశమె
యీకడఁ బాటువి కేశఁడవైన
నీకృప నాయందు నిలుపవే దేవ
సౌందర్యనాయక ! సకలాండజనక !
యింక నుపాయమ్ము లేమైనఁ జేయ
మూహించి గని యప్పుడొగి సన్నుతించి
యా హరుఁడశరీరియై యానతిచ్చె
నోపాండ్యభూవర ! యొక యోజనమ్ము
నేవు దీపించు నీవేలు సేనలను
గూడుక నెదురేగి ఘోరమ్ముగాఁగ
నాడ యుద్ధము సేయు మటు వారితోడ
నీవెంటఁ దోడుగా నేను వచ్చెదను
వేవేగఁ జనుమన్న విని పాండ్యవిభుఁడు
ఘనతర సంతోషకలితుఁడై యపుడు
మనమున నాస్వామి మహిమ లెన్నుచును
రథగజాశ్వములు వీరప్రవాహములు
పృథులమై కొలువఁగాఁ బృథివి కంపింప
నరిగి శత్రుల యోజనమున నెదిరి
పసగ లాకాశమ్ము ప్రబలి నర్తింప
నాచోళభూపాలుఁ డట్లు కావించ

భూచక్ర మ్రదుప నద్భుతలీలఁ జేరి
యిరుసేన లంతంత నెదిరించి రంత
శరధియు శరధియు సంధించినట్లు
గగనమ్ము గగనమ్ము గదిసినయట్లు
తగమించి తలపడి ద్వంద్వయుద్ధమ్ము
నొకఁడు లక్ష్యము సేయ నొకఁడేయ శరము
వికలత నడుమున వెసఁ ద్రుంచువారు
పొలుపొంద మొదలను బూనిన పూన్కిఁ
దలద్రెళ్లియును శత్రుతలఁ ద్రుంచువారు
విరథులయ్యును బ్రతివీర రథ్యముల
కుతికి చక్కాడెడి యుగ్రయోధులును
దొడరి వారణములఁ ద్రుంచి మావంతుఁ
బుడమిపైఁ బడవేయు భూరిసాహసులు
రట్టడి రౌతుగుజ్జములతోడ నొక్క
పెట్టునఁ దెగవ్రేయు బిరుదురావుతులు
గతిగ్రుచ్చి తనువున గాడుబాణములు
వెతికి వైరుల నేయు బిరుదుబంటులును
చలమున ఘనవీరసంఘముల్ రణము
సలుపంగ నాయిరుసైన్యంబులందు
నరయఁగ ద్విరదము లరదముల్ గాఁగ
నరదముల్ గజములై యవనిపైఁ ద్రెళ్ల
వరవీరభటులు నశ్వములైరి మఱియు
పరగనశ్వములు గాల్బలములై రొప్పె
నవని వ్రాలిన కరులచలముల్ గాఁగ
నవచామరములు ఫేనంబులుగాఁగ
ఘనతురగములు నక్రమ్ములుగాఁగ
ధనువు లాశీవిషతండముల్ గాఁగఁ
బడగలు జలగణ పంక్తులుగాఁగ
పడిశిరోజములు శైవాలముల్ గాఁగ
రథచక్రములు కూర్మరాజులుగాఁగ
రథములు యానపాత్రమ్ములుగాఁగ
తేరెడి పక్కెరల్ తెఱలును గాఁగఁ
గాలాటి? శంఖకర్కటములు గాఁగఁ

సకలాయుధములు మత్స్యంబులుగాఁగఁ
బ్రకటిత కోపాగ్ని బడబాగ్ని గాఁగఁ
ఢక్కానినాదముల్ తుములమ్ముగాఁగఁ
జేకొన్న జయలక్ష్మి శ్రీలక్ష్మి గాఁగ
ముక్తాతపత్ర మంబుజములు గాఁగ
రక్తపూరమ్ము నీరంబులు గాఁగ
సంక్షోభిచంపమై యద్భుతంబెసఁగ
జృంభితహృదయులై చెలరేగి గెలుపు
నయ్యెడ నిరువాగు నతిఘోరయుద్ధ
మయ్యె సురాసురులందు లేదయ్యె
నప్పుడు తీవ్రాంశుఁడధికమై పొదవె
డప్పిచేఁ జోడని దళితగాత్రమెల్ల
మడిసె నయ్యుద్ధాన మడియుట కాకఁ
జాండీఁడు శివభక్తిఁ బరుఁడౌట నతని
దండును దగఁ గాలధర్మంబు వలన
నందిన సమరంబు నం దేగువారు
చెందిన దాహమ్ముచే నొచ్చువారు
నైయున్న నంత నాపాండ్యవిభుఁడు
నెయ్యంపుభక్తుల నెమ్మనంబందుఁ
బాయకున్నట్టి యా బాణవాత్సల్యుఁ
డాయెడఁ జొక్కనాయకుఁ డాదిమూర్తి
జంగుళి శైవవేశ్యా భుజంగాంకుఁ
డంగజ భస్మాంగుఁ డఖిలాంతరంగుఁ
డాపాదమస్తక మాద్యంతమెల్లఁ
బ్రాపించ భూతిరుద్రాక్ష లింపొంద
ధరియించి కాషాయదండముల్ పూని
శిరమున జడలు నంచితలీలఁ దాల్చి
జలివేంద్ర జంగమై సలిలప్రవాహ
ములుగాఁగఁ గావళ్లు మోచుక వేగ
వచ్చి యాపాండ్యభూవరు సైన్యములకు
నచ్చటఁ జలివేంద్ర యమరఁ గావించి
యధికవాసితమైనయట్టి తచ్ఛైత్య
మధురాంబుపూరముల్ మది కింపుగాఁగ

ప్రజత్పృష్ణ తీఱ ధీరత్వమ్ముచేత
నిజభక్తిఁ జూసి మన్నించె వారలను
నప్పుడాఁకలి దప్పి యంతయుఁ బాసి
యప్పాండ్య విభునేన ఆటోపమునకు
వీరత్వమడర దోర్వీర్యమ్ము లడర
వైరిసేనలను సర్వమ్మును గూల్చి
యనఘు నాచోడని నాపాండ్యరాజు
ననుజన్ము నటువేగ నవలీలఁ బట్టి
యాపాండ్యరాజేంద్రు నగ్రభాగమున
జూపించి పెట్టిరి యాధిగాఁ దెచ్చి
యంత నద్భుతుఁడై యరిగె నాస్వామి
పొంత నా చలివేంద్ర పోయె నారీతి
నయ్యెడ నాశ్చర్యుఁడై పాండ్యనాథుఁ
డియ్యెడ మధురాపురీశ్వరుండైన
శ్రీచొక్కనాథుఁ డూర్జిత కృపాంభోధి
నాచోటు దయగల్గి నన్నుపాలించి
చలివేంద్ర పెట్టి యా జనుల రక్షించి
వెలఁగి యీ జయలక్ష్మి చేర్చె నాకనుచుఁ
దనయనుజునిఁ జోళధరణీశుతోడఁ
గాని చొక్కనాథుని గుడికినిఁ బోయి
యాస్వామి సంముఖాన నతివేడ్కఁ బెట్టి
యాస్వామి యని భక్తి నొనరఁ బ్రార్థించె
నంచితోమాంసంగ! యతనుభస్మాంగ!
సంచితవేదాంగ! జలధినిషంగ!
సురనదీజూటాంగ! శుభ్రవర్ణాంగ!
కరధృతసారంగ! కరుణాంతరంగ!
నరహరిమదభంగ! నవ్యహేవాంగ!
సరసనద్గుణసంగ! శరభవేషాంగ!
భక్తసంరక్షాంగ! ఫణిభూషణాంగ!
భృక్త సజ్జనభృంగ! వృషభతురంగ!
భవభయ గుణభంగ! పార్వతార్ధాంగ!
శివ శివ ధవళాంగ! శ్రీ చొక్కలింగ!
వీరిఁ జేసెడి దేమి వేవేగ నాకు

ఘోరున నానతీ భూతగణేశ
యని విన్నవించిన నశరీరి యగుచు
మనుజేంద్ర ! జయము నీ మనసు రా నయ్యె
నిఁక నీదు తలఁపున కెట్లు గావలసె
నొకటి నీ వారల నొగి నట్లు సేయు
మని దేవదేవుండు మఱి యానతీయఁ
దనరంగ సాష్టాంగ దండమ్ము వెట్టి
సంతోషితానంద సంపూర్ణుఁడగుచుఁ
గొంత సేపా దేవుఁ గొలిచి యా పాండ్య
భూమీశుఁడా చోడ భూమీశుఁ జూచి
రా ! మహీపాల ! నీ రాజ్యమ్ము నేయు
మంచును వస్తు వాహనము లెన్నేనిఁ
గొంచుఁ బొమ్మంచుఁ బేర్కొని యిచ్చి పంపి
తన యనుజన్మునిఁ దగఁ గావ లూడ్చి
యొనరంగ నీ యిచ్చ నుండు మటంచు
మజ్జన భోజనాంబరముల యందు
సజ్జననాథుఁ డొయ్యనఁ బొందుపఱచి
యాతనిఁ గట్టడ నటుచేసి వెలయ
భూతలంబేలె నా భూతేశుకృపను
నిదియు ముప్పదినాలుగిటు మీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి.
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె,

ముప్పదియైదవ లీల.

మఱియును నా స్వామి మహిమలు నచట-
వరుసతోఁ దరు పుష్పవన మనఁగలదు
నాయూర జొన్నాయి యను వారవనిత
కాయజాంతకు భక్తి గల్గి యే ప్రొద్దు
దనకును వచ్చు నాదాయమంతయును
ననుదినమ్మును జంగమార్చన సేయు
నెందరే నొడయలు నేగుదెంచినను
విందు వెట్టినయట్లు వేసర కిడుచు
హరుని యుత్సవ విగ్రహమ్ముగా నొకటి

తిరుమేను నేయింతు దేవుని కనుచు
మైనాన రూపించె మఱియుఁ బ్రామథున
మేను నేయింప నేమియు వగలేక
తన విశేషముఁగూర్చి శాస్త్రంబు పుచ్చు
కొని జంగమార్చన కూడదనుచుఁ
జింతింపుచున్నంత శ్రీ చొక్కనాథుఁ
డంతట సిద్ధుఁడై యచటికి వచ్చి
యొడయాల పంక్తిఁ గూర్చుండి భోంచేసి
విడిసి యా యొడయల వెంటఁ బోకున్నఁ
బరమసిద్ధునిఁ జూచి భక్తురాలతని
చరణమ్ములకు సాగి శరణార్థియనినఁ
దరమైన సొమ్ములు తనువునఁ బూని
గురువింజవూస ముక్కున బెట్టి నీల
మనిన నా బాలిక యతి భక్తితోడఁ
దన నోరుమూసి పాదము బట్టికొనఁగ
మగువ ముక్కెఱ ముత్యమాయె, నా తపసి
నగుచు విభూతి జొన్నాయికిఁ బెట్టి
యరయఁ గన్నులనీల మధరంబు కెంపు
వెర వొప్పఁ గురువింద విధమాయె ననిన
నా సతి తనయందు నాస నున్నాఁడు
నీ సిద్ధుఁడని వచ్చి యిందుండ నేల
విచ్చేయు లోనికి వేడ్కతో ననిన
నిచ్చ లే దబల! మా కేమిటి మీఁద
నీ మది చింత మానిచి పోదు ననుచుఁ
బ్రేమతో మధురాపురి న్వెడి వచ్చి
తని చెప్పి నీ యింట నంతయుఁ గలుగు
సినుఁకు ముత్తెల్లను నిటు తెమ్మి యనిన
నిల్లు శోధించి యా యినుమొల్లఁ దెచ్చి
మొల్లమ్ముగా సిద్ధు ముందరఁ బెట్టి
నవి యొల్ల ముద్దగా నపుడు నేయించి
యౌషధం బొక్కటి యందుపైఁ బూసి
యిడి యగ్నిపుటమున నీ ప్రొద్దు పెట్టు
పదియాఱు వన్నియ బంగారముగను

యని సన్నుతుల్ జేసి యందఱు గూడి
తని సంఘపలక నిచ్చలు నుండి రంత
నిదియు నేఁబదినాల్గ నింకమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార యనుచు
నా యగస్త్యుండును నానందమంది
యాయతోన్నతముగా నటువారి కనిరి.

## ఏఁబదియైదవ లీల.

నా మహామధురఁ బాండ్యావనీశ్వరుఁడు
నామునాదేశ కృపాపూర్ణుఁడగుచుఁ
బాలించుచున్న యాపట్టణమ్మునను
సంగీతసాహిత్య లక్షణుండైన
కపిల సంస్మృతుండు ఘనుఁడొక్కరుండు
నపుడు నా పాండ్యభూపాగ్రణిఁ జూచి
తా రచియించినయట్టి ఘనకావ్యమెల్లఁ
జేరి యాభూపాలు చెంతను జదివెఁ
జదివినదెల్ల నశ్లాఘ్యమ్ముఁ జేసి
పదపడి యాతనిఁ బాటింప కపెపె
ననిపిన నతఁడు లజ్జాయత్తుఁడగుచు
ఘనమైనచిత్తమె కడఁగి సౌందర్య
గుడికి నేతెంచి యో కుధరాత్మజేశ !
జలధర శశిధర సజ్జటాధార !
పురహర భవహర భోగీంద్రహార !
కరిదైత్యసంహార ! ఘనకృపాకార !
కాలకూటాహార ! కలుషాపహార
దుగ్ధపారావార తుహినాద్రిహార
స్నిగ్ధవర్ణస్ఫార నిర్మలాకార !
రూపింతు శబ్దస్వరూపకుఁ, శక్తి,
ప్రాపించు నర్థమ్ము పరమేశుఁడనుచు
వేదశాస్త్రమ్ముల వినియు నీరీతి
మేదిని వెలయంగ మేటినై కొంత
కావ్యమ్ము సెప్పి సత్కావ్యులు మెచ్చ
నవ్యమౌ పాండ్యభూపాలుని యెదుట
మోదమ్ముతోడ నింపుగఁ బఠియింప
నాదరింపక యనాదరణమ్ము జేసి.

యదయుఁడై న న్నుదాసీనముఁ జేసె,
నది సేయుటయు మిన్న నంగయకణ్ణి
యమ్మను గైకొననట్టిది కాదె !
యమ్మనుశేంద్రుండు నటుసేయుటెల్ల
ననుచు, నడుకాండ దండద మ్రొక్కి
నా నేను బోరొంద నంచు సంతాపమూనను.
ఆంతటఁ దనభక్తుఁడైన యామధ్య
కాంతారుఁ డటు చనఁగాఁ జూచి తాను
నప్పు డంగయకణ్ణియమ్మఁ దోడ్కొనుచు
నప్పరమేశ్వరుఁడా చొక్కనాథుఁ
డది యెట్లు నా కావ్య మతఁడు కాదనుట
పదపద యేనును బద పెత్తుననుచు
నాతని వెంటఁ దా నరిగెను వైఖ
కాతటి నుత్తరప్రాంతమ్మునకును.
పరుస నా గ్రామదేవతలును దుర్గ
కరివక్త్ర భైరవ కగపరదాదు
లాశాధినాయకు లాది సన్మునులు
నా సంఘమంటమ్మందున్న కవులు
ప్రమథవర్గమ్ములు భాసితమ్ముగను
క్రమముతోఁ గొలుపంగఁ గడువేడ్క నుండె
నంతట మఱునాఁడు నాయుపశాల
మెంతేని శివభక్తు లెల్లరు గూడి
యాయెడ స్థానికు లటమున్నఁ బూజ
సేయఁగా వచ్చి యచ్చెరువంది వారు
నాట యా దేవుని యావాసమునకు
మోదమ్ముతోడుత మ్రొక్కంగఁ బోయి
యామహాదేవుని నచ్చోటఁ గాన
కామహేశ్వరులు బ్రాహ్మణులు భీతిలుచుఁ
గిచ్చర వెదుక నక్కడ వైఖదరిని
నారొండఁ బ్రమథమహాముసుల్ సురలు
గొలువంగ నున్నాఁడు కోర్కులు మీఱ
వెలయంగ నిదియేమి విధమొకో యెఱుఁగ
మని విన్నవించిన నతిభీతుఁ డగుచుఁ

గనశాసనము క్రిందఁ గడుబడి లేచి
మొలచీర వీడఁ గ్రొమ్ముడి వీడ జాఱఁ
గలఁగుచు వేవేగఁ గదలి యాక్షణమ
తనస్త్రీలు దానును దనమంత్రు లెల్ల
రును గొలువ స్వామి వేరోలగంబున్న
యాతావుకరిగి భయాతురు లగుచు
భూతేశు పాదాల ముందర భూమిఁ
బడి పొర్లి మ్రొక్కి యోపరమేశ! మీరు
వెడలిటకును వచ్చు విధ మిదియేమి?
నావల్ల దప్పేమిఁ నాకానతిమ్ము
ఈపట్ల మీరేగు నీ విధంబెల్లఁ
గారుణ్యనిధి! యంచుఁ గన్నుల బాష్ప
పూరముల్ నింపుచుఁ బొరిఁబొరి నేడ్చు
చున్న యాభూపాలుఁ జూచి యా స్వామి
యున్నికగా నానతిచ్చె నిట్లనుచు
నీమీఁద దప్పేమి నీతోడిదేమి!
నీమీఁది కోపము నేనెన్న నేల?
నేము నీ స్థలమున కెనయైన స్థలము
నేము గావరె నన్న నెచ్చోటు లేదె!
నీవంటి భక్తులు నిక్కమ్ముగాఁగ
నావల మఱినాకు నందంద లేరె
యా యడుకాడుడు నా కమిగాప్తుఁ
డాయొక నొకకావ్య మనువొప్పఁ జేసి
యర్థిమై నీపాలి కర్థముగోరి
యర్థింప నిచ్చిన నర్థికి నీవు
నర్థ మీనోపక యాకావ్య మందు
నర్థము దెలిసిన హంకారమునను
నర్థి నుదాసీన మటు సేయఁ దగునె
పార్థివేశ్వర! నాకు భక్తుఁ డీతండు
గాన నే మీమధ్యకాంతారుఁ డలిగి
రా నిందు నతనికై రాఁ బ్రాప్తి కలిగె
నీవిందు రా నేల? నీచోటి కరుగు
మని యమ్మహాదేవుఁ డానతిచ్చినను

వినియు నాపాండ్యభూవిభుఁ డాత్మఁ గలఁగి
శంభో! మహాదేవ శాశ్వతైశ్వర్య!
యంభోజ సంభవాద్యర్చితపాద!
వేదరక్షణ జాతవేదోజ్జ్వలాక్ష!
బాదరాయణ భుజాబంధనకరణ!
హా దేవ! దేవవేశ్యాభుజంగాంక
యో దేవ దేవ మృత్యుంజయ! యేను
నజ్ఞాని నపరాధి నవివేకపరుఁడ
ప్రజ్ఞావిహీనుండ భవబంధనుండ
నా నేర మెన్నక నన్ను మన్నించి
యేను జేసిన నేరమెల్ల లోఁగొనుచుఁ
జనవిచ్చి రక్షించు సౌందర్యనాథ!
యని సన్నుతులు సేయ నా పాండ్యవిభునిఁ
గరుణించియప్పుడా ఖట్వాంగపాణి
తిరిగె హరిబ్రహ్మదేవతల్ మునులు
నాయడుకాండ డాద్యైనసత్కృతులు
నాయెడఁ గొలువంగ నతిసంభ్రమమునఁ
గడువేడ్క నంగయకణ్ణమ్మతోడఁ
దడయక విచ్చేసెఁ దనస్థానమునకు
నరుసతో సకలదేవతలును మునులు
నరిగిరి తమతమ యాశ్రయములకు
నప్పు డాసౌందర్యుఁ డావైఖ దరిని
నొప్పుగా విచ్చేసి యున్న యాస్థలము
నరయంగ నుత్తరహాలాస్య మనఁగ
వెలసెను నచ్చోట వినుతింప నంత
నామహీపాలుఁ డానందమ్ము నంది
యా మహాదేవున కర్చనల్ చేసి
పరిమళ భూషణాంబరము లొసంగి
గరిమతో నామధ్యకాంతారుఁ జూచి
యా స్వామిపై నీవు నతిభక్తి గలుగ
నా స్వామి నీపజ్జ కటకు విచ్చేసె
నీవు పుణ్యుఁడ వౌదు నిక్కమ్మి యనుచు
భావించి యతనికి బహుభూషణమ్ము

తెప్పించి పట్టపుఁ దేనుఁగుమీఁద
నప్పుడు నెక్కించి యతిసంభ్రమమునఁ
బురవీథులెల్ల నింపుగ నేఁగఁజేసి
వరుసతోఁ దగఁ గట్టువర్గము లిచ్చె.
తదయన మధ్యకాంతారుని వెనుక
నతివేడ్క నుత్తరహాలాస్యమునకుఁ
దొడరి వచ్చినమాడ్కిఁ దొడరి యేసేట
నెడపక వచ్చియు నెపుడు నాస్వామి
నిదియు సేవించెను నిటమీఁద చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## ఏబదియాఱవ లీల.

మధురాపురిపాండ్య మండలేశ్వరుం డం
విభుఁడొకఁడు సత్కృపావిఖ్యాతుఁడగుచు
మతిమంతులెల్ల సన్మతి నీతిఁ జూప
మతిమించి రాజ్యమ్ము మహిమఁ బాలింప
కైలాసవాసుని గణనాథుఁ డొకఁడు
హాలాస్యపురమున నగ్రజన్మమున
మధ్యగోత్రజ్ఞున మహి నెన్నఁబుట్టి
యధ్యయనాది విద్యాకళా ప్ర
వీణుఁడై సౌందర్యవిభవ సంపదలఁ
బ్రతిలేక యుండు నా పాండ్యభూవిభుఁడు
నతని నెల్లరుఁ జెప్పనంతయు నెఱిఁగి
ఘటహారులను బంపి పరఁగ రప్పించి
ప్రణుతింపఁ దెన్నవ బ్రహ్మయనంగ
ఘననామ మతనికిఁ బనరఁ గావించి
వలయు నాభరణముల్ వరుసతో నిచ్చి
వలసిన యన్నముల్ వలనుగాఁ జేసి
దండనాయకుఁడవై తనర నా వెంట
నుండుమంచును ముద్దుటుంగర మిచ్చి
పాయవాకిటి మఱి పారుపత్యమ్ము
నేయంగఁ గట్టడచేసె నా విభుఁడు

నంత నామంత్రి యత్యంత చాతుర్య
వంతుఁడై సద్గుణవంతుఁడై నీతి
మంతుఁడై సౌభాగ్యవంతుఁడై రూప
వంతుఁడై శివభక్తి మంతుఁడై యుండి
యతులిత స్వామికార్య ధురంధరత్వ
మతి నెంచి తొల్లిటిమంత్రుల మించి
మధురేశ్వరునకును మాహేశ్వరులకు
నధికధనమ్ముల నర్పించి మఱియు
నొనరంగ దానధర్మోపకారమ్ము
లనయమ్ము సేయంగ నానిమిత్తమున
నా పాండ్యవిభునకు నధికమ్ముగాఁగ
ప్రాఁపుగా సంపదల్ పాటించి మించె
విశ్వాసయుతయుఁ దన్ను వినుతింపుచుండ
శాశ్వతుండై యుండె సౌందర్యకృపను
నంతటఁ గొన్నాళ్లకశ్వరక్షకులు
చింతింపుచును వ్యగ్రచిత్తులై రాజుఁ
జేరి యందఱు వచ్చి చేతులు మోడ్చి
యో రాజ! యశ్వమ్ము లష్టాశ్వములెంతో
యతిసారముల చేత నధికమైనట్టి
మితిలేని వ్యాధుల మెయికొని కొన్ని
దీర్ఘనిద్రల బొందితెగ నున్నవింక
ననిసాహిణులు వచ్చి యటు విన్నవింప
ఘనమున వలపోసి మనుజేశ్వరుండు
నొప్పుగాఁ దిరువాదయూరి దేవునకు
రప్పించి యట్టివార్తల నెల్లఁ జెప్పి
యశ్వశాలల రాజితాశ్వమ్ము లెల్ల
నశ్వర యత్నమై సగ్గె నన్నియును
నాటోప మొప్పఁగ సైన్యము లెన్నియైన
కోటానకోటులు గొల్చివచ్చినను
ఘోటక గజములు గొల్చి రాకున్న
పాటింప రహిత భూపతు లటుగాన
రయమొప్ప ద్వీపాంతరముల నేతెంచు
హయములఁ గొనితెమ్మి యట దగఁ బొమ్మి

యనుచు నాతనికిచ్చి యధికమైనట్టి
ధనరాసు లెంతేనిఁ దగవాళ్ళఁ బంపెఁ
బంపినఁ దెన్నవ ప్రష్టారాయంబు
సొంపెసంగార నా సోమసౌందర్య
సంగడికినిఁ బోయి సన్నుతుల్ జేసి
యంగయ కన్నమ్మకా దేవునకును
నిండిన సద్భక్తి నియమంబు బూని
దండప్రణామంబు దనరంగఁ జేసి
శరణు శరణ్య! యో శరణార్థిరక్ష!
శరణు దుష్కృతశిక్ష! శరణనలాక్ష!
శరణు తారకదైత్య సంహారకార
శర ణంధకాసుర రాక్షస దక్షవైరి
శరణంబరాంబర! శరణంబికేశ!
శరణజహరివంద్య శరణు బృందార
శరణసేవిత! యీశ శరణు విశ్వేశ!
శరణు నాస్వామి నా శరణు లోఁగొమ్ము
కాకోదరేశకంకణ! నీదుభృత్యుఁ
జేకొని నా కార్యసిద్ధి గావింపు
మని వేడుకొనుచు నా హరునాత్మ నిలిపి
సదిమూలము కేగి వలనైనయట్టి
తిరుపెరుందూరను దివ్యమైనట్టి
పురమున కా మంత్రిపుంగవుం డరిగి
యందుఁ బ్రవేశించు నంతమాత్రమునఁ
బొందె సుజ్ఞానంబు పొందె నాతనికి
నప్పుడు నొకచోట నతఁడు గూర్చుండి
యప్పాండ్య భూపాలుఁ డంపిన ప్రజల
రావించి యీనెల రాళ్ళు గుఱ్ఱములు
ఆవణినెలఁ గొంచు నట వత్తు ననుచు
నన్నరనాథున కంతయుఁ దెలియ
విన్నవింపుఁడు మీరు వేవేగఁ బోయి
యని వారి మరలంగ ననిపి తానందు
ఘనముగా నపుడు సుజ్ఞానమ్ము మించి
తెలియ నాధార స్వాధిష్ఠానములను

నలమణి పూరకంబా యనాహతము
కడు విశుద్ధము నను కమలముల్ గలుగ
నడర షడ్వర్ణ లింగాధికులైన
కరివక్త్ర కమలజ కమలపత్రాక్షు
లరయఁ బినాకియు నా సదాశివుఁడు
పరశివుండును బరబ్రహ్మంబులైన
మఱి దైవతంబుల మదిలోన నిలిపి
వర్ణబీజమ్ముల వర్ణాక్షరముల
వర్ణింప నాల్గును వడినాఱుఁ బదియుఁ
బన్నెండు పదియాఱు భావింప రెండు
నున్న వేయింటిని నొనర నర్పించి
వర్ణింప నాద్యాషడ్వర్ణ లింగముల
నిర్ణయించుచుఁ దన్ను నిజముగా నెఱిఁగి
యల మీఁదటి మనోలయ స్థానమందు
వెలయ నప్పరమాత్మ వెదకుచు నుండె
ననఘుండు నాయూర నాశంభులింగ
మును గోరి యాగుడి మ్రొక్కంగ బో
నమ్మహా చొక్కనాయక దేవుఁ డడరి
నిమ్మమ్రాకుల నీడ నెమ్మితో నుండె
మఱి తొమ్మనూఁట తొంబదియు తొమ్మండ్రు
గురువును శిష్యులై కొలువంగ నపుడు
నా తిరువాదయూ రరుగు చో నెదుర
నాతఁడే గురురూపమై దేవదేవు
డచ్చోట నాతని యగ్రభాగమున
వచ్చేసి యుండంగ వేగంబె గాంచి
దొరకొన్న భవబంధ దురితముల్ ద్రుంచి
యొనర నా తిరువాదయూరు దేవునకు
ననువందఁ జేరి సాష్టాంగముల్ సేయ
శివుఁ డప్పుడాతనిఁ జేర రమ్మనుచుఁ
బ్రవిమల సద్గురు భావమ్ముగాఁగ
వరుసఁ జక్షుస్స్పర్శవాచక శిక్ష
లరుదుగా నియమించి యందంద మఱియు
లోల కామక్రోధ లోభ మోహములు

చాలంగ మదము మాత్సర్యము లాఱు
నారయఁ ద్రోచి పృథ్వ్యప్పు లగ్ని
వాయు వాకాశము లివి నంపఁ గల్గు
వసనైన యట్టి శబ్ద స్పర్శరూప
రసగంధములు వచ్చి కసవు గాలించి
యమరఁ ద్వక్చక్షుశ్శ్రోత్రము జిహ్వ నాసి
కయును నేనింటి సంగతులూడ్చి మఱియు
వరగంగ వాక్పాణి పాదపాయువులు
నరయ నాగుహ్యగతాంగమం బరసి
పూని ప్రాణాపానములు సమానం బు
దానవ్యానాఖ్య స్థలము లెంచరి మఱి
వెలయ నిట్లగు పంచవింశతి తత్త్వ
ములయందు నధిక సద్బోధ గావించి
నిరవుగాఁ బిక యమనియమాసనంబు
లరయఁ బ్రాణాయామ మరయుక మఱియు
నమరఁ బ్రత్యాహారధ్యాన ధారణ స
మాధి కయోగము లైన యష్టాంగ
మాఖ్యకముగ మిక్కి నాత్మలోఁ దెలిసి
గమకమై నాభిపద్మమున నున్న పాము
కరమొప్ప బోధించి కమలను లాఱు
విరచితంబైయున్న విధములు దెలిసి
వెరసి డెబ్బది రెండువేల నాడులు
నరయ నా వేళల నదిమి పట్టుచును
బలిమిమై నటు కొన్న మచ్చిక నాడి
సొరిది మెల్లనె గాలి జొనవంగఁ జేసి
యరసి యా సోమార్కులను గూర్చి పట్టి
పరసుధారస వార్ధి నోలలాడుచును
గలకండఁ గాంచి యక్కడ దృష్టి నిలిపి
యా నిరంజనుతోడ నాత్మను గూర్చి
తాను నేననువార్త దలఁపున లేక
యున్న పుణ్యుఁడు శివయోగి యౌఁగాక
యున్నియు నెఱుఁగ నా యిందుశేఖరుఁడు
వలను మీఱఁగఁ దిరువాదపూరికిని

తెలియఁగ జ్ఞానోపదేశమ్ముఁ జేసి
జగతి మాణిక్యవాచకుఁడను నామ
మగణితమ్ముగఁ బెట్టి యతని మన్నించి
తప్పక శిష్య సంతతులతోఁ గూడి
యప్పు డదృశ్యుఁడై యరిగె నా స్వామి
దీవించి మాణిక్యవాచకుం డప్పు
డడిబడి వడి శివభ్రాంతత్వ మూని
కానుకతోఁ దిరువాచకంబను కావ్య
మందగాఁ జెప్పె నెల్లరుఁ బొగడఁ
గోరి యా హయములఁ గొనుచు రమ్మంచు
నా రాజు నిచ్చిన యట్టి ధనమ్ము
గుడి గోపురమ్ములకును దైవములకు
నడరంగ నా మహేశార్చనమ్ములకు
మఱియుఁ గల్గు దానధర్మంబుల కెల్ల
నిరవైన యా ధనం బెల్లను నొసఁగి
తిరముగా నా యుపదేశించినట్టి
గురుని భావించుకొని యెంచుఁ గాన
లేక నా గురువున్న లిసుచ వృక్షమ్ము
ప్రాంతమ్ముగఁ జేరి పరమహర్షమున
నా పూర నా గుడి నా పాండ్యమునను
నా మహాదేవుని నరసి సన్నుతులు
చేయుచు వెదకుచు జింతింపుచుండ
నా యొక సుజ్ఞాన మధికమై మించె
నంత నా పాండ్యుని కుందున్న మంత్రు
లెంతయు వేగంబ యేతెంచి నిలిచి
రా రాజ తిరువాదయూర దేవుండు
మీ రర్థ మిచ్చి పంపినఁ బోయి యతఁడు
గుఱ్ఱాల గొనక పేర్కొని శివధారి
నైత్రియై గుళ్ళకే వెదఁ జల్లె ననిన
నా వార్త విని రాజు సత్యుగ్రకోప
మావహిల్లఁగ నప్పుడా క్షణమ్మునను
వడి డిగమ్ముల వారి రావించి
యడుగక దిరువాదయూర దేవునికి

ఘోటకమ్ముల వేగఁ గొంచు రమ్మంచు
మాటిమాటికిఁ దిరువు మఱి మీర నుండి
యాతని గుఱ్ఱాల నడరి తోడ్తెండు
నా తాపునకుఁ బొందు నతివేగ రండు
నని నిరూపం బిచ్చె నంత నయ్యెడను
జని వార లందఱా ప్రభునిఁ జూచి
చేరి డగ్గఱ వచ్చి శీఘ్రమ్ము గాఁగ
నా రాయసం బప్పు డతని ముందరను
బెట్టిన నాతఁడు పేర్కొని చదివి
నెట్టన నేను పాండీని ప్రధాని
నంచును మదిలోన నవ్వుచు దెలిసి
యంచితమ్ముగ ద్రవ్య మధికమ్ము గాఁగ
గొంచు గుఱ్ఱముల్ గొని తెమ్మటంచు
బంపడే నన్ను నా పార్థివేశ్వరుఁడు
హయములఁ గొననైతి నాధనం బెల్ల
ప్రియమారఁ గుళ్లకు, రాజద్రోహమ్ము
పాటించె నాకు నీ భ్రాంతిఁ బుట్టించు
జూటేందుధరునిఁ ద్రిశూలహస్తుని
గోడమ్ముకై చెంచుకూపైన వాని
నోపక యాటవికోచ్ఛిష్టభుజుని
గాలకూటాహారుఁ గడు నమ్మఁగల్గ
శీలునిఁ బిత్ర్య ధరాసీనుఁడైనట్టి
భూతేశు పాలికిఁ బోయి విన్నపము
సేయుదు నంచు నా శ్రీకంఠుఁ గూర్చి
వరుస నామాణిక్యవాచకుం డపుడు
సురుఁడి నాయూరి యొడయారిఁ జేరి
కోరి యాస్వామిఁ బేర్కొని విన్నవించి
యో రాజశేఖర ! యొకవిన్నపమ్ము
మా రాజు పాండ్యభూమండలేశ్వరుఁడు
కోరి ధనంబిచ్చి గుఱ్ఱాలఁ గొంచు
నతివేగ రమ్మంచు నంపె నన్నపుడు
నతఁడు నిరూపమ్ము నంపె నాకిపుడు
సొరిది మాహేశ్వరార్చనలకు గుళ్ల

కరుదారగా నిచ్చి యాధనం బెల్ల
గుఱ్ఱాల నొకటైనఁ గొన్నట్టి లేదు
నఱ్ఱాడుచున్నారు నట రాజభటులు
నిందు కుపాయమ్ము లేమైనఁ జేసి
యందమై నను గావు మాపదుద్ధార !
యని సన్నుతులు సేయ నచ్చోటి కపుడు
వినువీధి శ్రీచొక్కవిభుఁడు విచ్చేసి
యాకాశవాణిగా ననువందఁ జేర
నీ కేల వెరప మాణిక్యవాచకుఁడ !
దండిగా హయములఁ దగఁ దెత్తు ననుచు
పాండీని క్రొత్తదై పత్రికలంపు
వాయుజవమ్ముల వాజు లెన్నేని
నీయాత్మ మెచ్చంగ నెట్లుఁ దెప్పింతు
నని యానతిచ్చిన నావాదవూరుఁ
డనఘుఁడు మదిలోన నానంద మంది
చయ్యన నప్పుడా సచివాగ్రగణ్యుఁ
డయ్యెడఁ బాండీని కటుఁ గమ్మ వ్రాసె
లాయము లెల్ల వాలాయమ్ము గాను
నాయెడఁ గట్టింపు డాయతమ్ము గను
గోరిన యట్టి యాఘోటకమ్ములను
భోరునఁ గొనితెత్తుఁ బొందు మీరనుచు
బోరిపోరి నూడిగంబుల వారి ననిపి
శుభగ నా స్వామి దే భారమ్మనుచు
నెమ్మి నాగుళ్ళలో నిద్రింపుచున్న
నమ్మధురేశ్వరుం డతని స్వప్నమున
నీమనోజయముగా నెమ్మి గుఱ్ఱముల
గొంచు సచ్చెదము నీకోర్కు లింపెసఁగ
గొంచ కీవటు వేగఁ గొముహొత్తుఁ బోయి
పడిమించి యశ్వముల్ వచ్చె నటంచు
బుడమీశునకుఁ జెప్పి పొసఁగ నందుండు
మని, యానతిచ్చిన నంత మేల్కాంచి
పనిఁ బూని యాస్వామిఁ బ్రస్తుతుల్ జేసి
యారాజు పాలికి నాతిరువాద

మీ రానతిచ్చి నేమించిన కతన
నా రాజునకు నేను నందఱు వినఁగ
హయములు వచ్చెనటంచుఁ బల్కితిని
ప్రియమంది యతఁడును ప్రీతి నన్ననియె
నీయొద్ద నశ్వమ్ము లిటు రాకయున్న
వేయేలఁ బ్రాణముల్ విడుతు నీయాన
యనుచుఁ జింతింపుచు నభినుతుల్ సేయ
వినువీధి వాణియై విశ్వేశ్వరుండు
భయమేల నీకు నో బ్రాహ్మణవర్య!
హయముల నిటఁ దెత్తు నటవేగఁ బొమ్ము.
అనియానతిచ్చిన నావాదయూరుఁ
డెనయంగఁ దనయింటి కేతేర నతఁడు
నతనిబంధువ్రాత మంత నేతెంచి
మతి మించి ధనమెల్ల మాయముల్ జేసి
భయపడి పాండ్యుని పాలికి వచ్చి
హయములు వచ్చునటంచుఁ బల్కితివి
యిందు కుపాయమ్ము నేమి జేసెదవు
పొందుగా మాకు నిప్పుడు సెప్పుమనిన
ధీరుఁడై వారితోఁ దిరువాదయూరుఁ
డీరీతి నిట్లు మీరేల నన్నడుగ!
నాపాలి శ్రీచొక్కనాథుండు వచ్చి
చేపట్టి నన్ను రక్షించు నేఁ దనకు
దాసుండుగాఁ జేసి తగ నశ్వములకు
జేయు నింకొక వగ సిద్ధమ్ము గాఁగ
ననిన వారందఱు నౌఁగాక యనుచుఁ
జనిరంతఁ దమనివాసములకు నంత
నాఁడు నామఱునాఁడు నారాజు పనుప
నూడిగమ్ములవారు వోలి వేతెంచి
హయములు వచ్చెనో యంచు మీకడకు
రయముతో మమ్ముంపె రాజు నిచ్చటికి
తురగమ్ము లెవ్వి? యిందుకు విధంబేది
నాతోఁ జెప్పవలెను మాణిక్యవాచకుఁడ!
అన విని వారితో నామంత్రి వరుఁడు

తనుఁడు వేగిర మేలఁ బయ్యన మీరు
కరమొప్పఁ బరము శృంగారింపు డెల్లి
తురగమ్ములిందుఁ బొందుగ వచ్చెననుచు
వారి నంపిన వారువచ్చి యారాజుఁ
జేరి విన్నపములు జేసి రారీతి
విని యప్పు డాపాండ్యవిభుఁ డతివేడ్క
ఘనముగాఁ బురము శృంగారింపఁ జేసి
వాటపై లాయముల్ వరుసఁ గట్టించి
ఘోటకమ్ముల రాకఁ గోరుచునుండె
నయ్యెడ దివసత్రయమ్ము నచ్చటికి
నెయ్యమ్ముతో రాక నిలిచె నశ్వములు
విదియు నేఁబడియాయె నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
హృదయమ్ము లలరంగ నీశిల విన్న
సదమలాచార సత్సంతతుల్ గలిగి
శివయోగముల సదాశివుని సత్కృపను
ప్రవిమలకైలాసపదవి నందెదరు
ననిన నమ్మునులెల్ల నత్యంతమోద
మున బొంది కలశజన్మునిఁ బ్రస్తుతించి
యొయ్యనఁ బిరుపాదయూరుఁ డేరీతి
నయ్యశ్వములఁ దెచ్చి యిచ్చె రాజునకు
హాలాస్యనాయకుం డతని నేరీతిఁ
చాలించెఁ జెప్పవే! పరమాత్మ! యనిన—

ఇది సర్వఘనసత్కవీంద్రపాదాబ్జ
విదితపూజామోదవిమలుండు పచ్చ
కప్పురసౌరభ్యకలితమాటాంక
తిప్పరాజనుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్మగ లోకవిఖ్యాతమైన
సరసలక్షణకావ్య సత్కవీంద్రాధి
నందిత శ్రీచొక్కనాథచరిత్ర
మందున నిది యష్టమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

## నవమా శ్వాసము

### ఏబదియేడవ లీల.

అంత నాపాండీడు నర్మ్యాద బుద్ధి
మంతులైన పురాణమంత్రుల కనిరాఁ
దిరువాదయూరుఁ డేతెంచి మాతోడ
ధరణీశ ! రేపు మధ్యాహ్నంబులోన
ఇత్తాయితమ్ముగా సైంధవ జాతు
లుత్తమాశ్వమ్ము లత్యున్నతి వచ్చుఁ
బురమార్గములును గోపురము మేడలును
దిరువాలవాయిని దేవాలయమ్ము
లాయమ్ములెల్ల వాలయమ్ముగాను
సేయు డలంకృతుల్ శృంగారముగను
నని మూఁడు దివసమ్ములయ్యె నేఁటికిని
ఘనతరాశ్వములు రాఁ గాన మేమియును
మితి బెట్టి ననుచు నమ్మితిమి వీఁడిట్లు
హితశత్రువై యుండు టెఱుఁగలేమైతి
మిందుకు వెరవేది యెఱిఁగింపుఁడనిన
నందలి సచివు లిట్లనిరి భూపాల !
కన్న కార్యము మాకుఁ గలిగినయట్లు
విన్నవింపక యుంట విహితమ్ము గాదు
నతఁడు శివభ్రాంతుఁడై యర్థ మెల్ల
సతతంబు జంగమార్చనలకుఁ బెట్టి
దొరకొని తిరువందదూరు నన్నట్టి
పురమునఁ గనకగోపురమంటపములు
నాకారమైనట్టి ప్రాకారములు ను
సాకారమైన యుత్సవ విగ్రహములు
నాలయంబైన దేవాలయం బచట
బాలేందుధరునకుఁ బరగఁ గట్టించి
తెరువుల సత్రమతిథులకు నిడుచు
మరులుగొన్నట్లు ధర్మములు సేయుచును
నర్థమంతయుఁ గొంచు నరిగి యీరీతి
వ్యర్థమ్ముగాఁ బాఱవైచి యున్నాఁడు
పట్టి తెప్పించి నిర్భరముగా బాధ

పెట్టి ద్రవ్యమ్ముఁ దెప్పింపఁ గావలయు
ననినఁ జింతాక్రాంతుఁడై యున్నారనుచు
జననాథుఁ డపుడు రోషస్వాంతమునను
వేత్రహస్తులఁ బిల్చి వే చని వాని
గాత్రమ్ముపై దొడ్డగడ్డ పెట్టితి
యిప్పుడు ధనమెల్ల నీక్షణమ్మునను
దెప్పించుఁడని రాజు తెలుఁగొప్పఁ బనిచె
వారు నచ్చటికిని వడిఁ బోవ నతఁడు
ధీరుఁడై యావేళఁ దిరువాదయూరుఁ
డగలిత హృదయుఁడై యతిభక్తితోడ
నచలజామాతుని నాత్మలో నిలిపి
పరతత్త్వ బోధలు పఠియింపుచుండెఁ
దరువుల కాండ్లును దగ నూరకున్న
మఱియుఁ గొందఱు ధూర్త మానసులైన
పరిచారకులఁ బంచి పట్టి తెప్పించి
యాజ్ఞాని తిరువాదయామాత్యవరుని
భూమీశ్వరుండు విస్ఫుట రోషమునను
హయములఁ దెమ్మంచు నర్థ మిచ్చినను
భయము లేకింతయు బాలుగ వైచి
వెడ వేషధారియై వీడిందు వచ్చి
జడియక నందు నీచందమ్ము లెల్ల
వీనిని గొ పోయి వెస వడ్డ పెట్టి
తాను గొంపోయిన ధనమెల్ల నిపుడె
కొనిలేక యున్న మీకును నాజ్ఞ వచ్చు
నని చారులకు వాని నప్పగించినను
వారలు మిగుల దుర్వారులై యతనిఁ
గ్రూరతఁ బట్టీడ్చికొనిపోయి రపుడు
కారాగృహస్థల ఘనశృంఖలముల
ఘోరమ్ముగాఁ బెట్టి గొబ్బున మాకు
దగఁ జెప్పు ధనము కేవగనైన ననుచుఁ
దగ బాధసేయ నంతకు కోర్వలేక
హా చొక్కనాయక ! స్వామిసోమేశ !
హా చిన్మయానంద ! హా లోకవంద్య !

యార్తరక్షణపరాయణుఁడ వీవనుచుఁ
గీర్తింతు రెవ్వరుఁ గృపగల్గు దేవ !
మాధుర్యపురనాథ ! మఱి యిట్లు నన్ను
బాధలు సేయంగఁ బాడియే నీకు
రాజశేఖర ! పాండ్యరాజశేఖరుకుఁ
దేజీల నిప్పుడు దెచ్చి యీకున్న
వేయేల ప్రాణమ్ము విడుచుట కాని
పాయ దీ కథ యేయుపాయమ్ములందు
ననుచు దుఃఖింపుచు నాస్వామి దూఱు
చును స్తోత్రములు సేయుచును నుండె నంత
తళియంజి చొక్కఁడాపత్సహాయుండు
నళగరి చొక్కఁడు నాత్మబాంధవుఁడు
దనభక్తుఁ డిట్లు వేదనల నందుటకు
మనమునఁ జింతించి మాయాస్వరూపి
యారాజ్యమునఁ గల యఖిలవర్ణముల
ఘోరవమ్ములను రప్పించి వేర్వేఱ
సారంగుఁ డళగఁడు జన్నఁడు గరుడ
నీలుండు గురువింజనీలుండు కెంపు ?
నీలుండు మొదలైన నిఖిలవర్ణముల
రంగైనయట్టి తురంగమ్ములకును
బంగారుటందెలు పాదాలు నమర
పళ్లాలు నుల్లాలుఁ బసిఁడిపక్కెరలు
కళ్లాల గబ్బిలు గద్దెపక్కెరలు
బల్లాలు కోరలు పలు నత్తడములు
చిల్లాణములు కొల్కి చికిలిచక్రములు
జల్లులు కుంచెలు సవరముల్ మఱియు
నెల్లసంజోకమ్ము లెల్లఁ గల్పించి
యత్తురంగములకు నమిరుల నమర
నుత్తమంబైన రాహుత్తులఁ జేసి
తలను సుళ్లఁవుఁజుట్లు దగ రుమారములు
మొలమీఁదఁ జల్లడమ్ములు దట్టిజార్లు
వజ్రాంగిజోళ్లను వడి రాగవళ్ల
విజృంభణమ్ముగా వేడ్క నాహయము

లెక్క యాడుచు వార లెసఁగ నేతేఁ
చొక్కనాథుఁడు తాను చొక్కమైనట్టి
యాయతమ్ముగను జిత్రాయితంబైన
మాయాతురంగమ్ము మహిమతో నెక్కి
రచనతో నుభయపార్శ్వమ్ముల గలిసి
యమరులు రాహుత్తులై కొల్చి రాఁగ
మధురాపురమ్ము నామడ మేరనంగ
విధుజూటుఁ డచ్చోట విడిసెఁ బాళెమ్ము
నప్పు డాతురగరింఖాదివ్యధూళి
కప్పి నల్దిశ లంధకారమ్ము పర్వె
నది గని భూపాలుఁ డారయోద్ధ్రుజల
కదె ధూళి యొగసె వాహములదే వచ్చు
చున్నవి యని చూచున్న నాలోన
సన్నమై రేణువు సమసె నత్తఱిని
నీ విధమ్ములు దాని యింద్రజాలముల
భావమ్ము గాని స్వభావమ్ము గాదు
ననుచును గుటిలుఁడై యారాజు తీవ్ర
మనుజులఁ బిల్చి యామాణిక్యవాచ
మంత్రిని వీఁపుచర్మము వీడునట్లు
తింత్రిణీ లతల మర్దింపుడీ ! యనుచుఁ
బనిచిన వేవేగఁ బటుగతి తోడ
జని వార లటు సేయఁ జాలినఁ జూచి
యా తిరువాదయూరుండు నత్యంత
భీతితో నాస్వామిఁ జేఁబ్రోవి యిట్లు
చేసితే సర్వేశ ! శివలోకవాస !
యాశాంబరోల్లాస ! యధికప్రకాశ !
ఘోటకమ్ములఁ దెచ్చి కువలయేంద్రునకుఁ
బాటించి యిచ్చి నాపాటు బోఁజేయు
మని విన్నవింపుచు హాలాస్యవిభుని
దనమదిఁ దలఁపుచు దైవమా యనిన
నాలించి యధికదయాళుఁడై యపుడు
లక్షోపలక్షలై లక్షణాశ్వములు
ఘోషారవమ్ముల కేడువారిధులు

ఘోషింప సకలదిక్కులు బిక్కటిలఁగఁ
బంచమహావాద్యపటలముల్ మ్రోయఁ
బంచాస్యుఁ డధికప్రపంచస్తుతోద
పంచాస్త్రపంచాస్య ప్రకటవిరించి
పంచాస్యహరణ ప్రభావమై బిరుదు
వినుత కాహళములు వినువీధి మ్రోయఁ
బ్రజలకుఁ గన్నులపండువై యుండ
నజాఁడును హరి యుత్తమాశ్వముల్ వేడ్క
నెక్కియాడుచు స్వామి కిఱుపార్శ్వములను
బక్క రాహుత్తులై ప్రబలి యేతేఱ
నత్తళమ్ములు ద్రిప్ప చమరరాహుతులు
కత్తులు విసరుచు ఘనతురంగములఁ
బరిపరిగతులను బహువిధమ్ములను
మెఱసి తొక్కుచుఁ జుట్టుమేళంబు లిడుచుఁ
దను గొల్చి రాఁగ సౌందర్యనాయకుఁడు
కను గొన్న సతులకుఁ గాంతులు వొడమఁ
బురమువారెల్ల నద్భుతముగాఁ జూడ
ధరణీశ్వరుఁడు నా దండనాయకులు
విభ్రాంతి గొనునట్లు విలసితభ్రాంత
మభ్రాంతగతులుగా నతివేడ్క నుత్త
మాశ్వమెక్కాడుచు మఱి పాండ్యమండ
లేశ్వరు నగరికి నేతేఱ నపుడు
పుడమీశుఁ డతిమోదమునఁ బొంది వేడ్క
వడిమీఱ మాణిక్యవాచకామాత్యుఁ
బిలిపించినను నతిప్రేమతో నతఁడు
నిలచేని కడకును నేతెంచి చాల
నమితుఁడై శ్రీచొక్కనాథుని కృపను
గములుగా నివె తురంగము లిటవచ్చె
జననాథ యొకపూట సైరింపు కింత
పనికిగా నన్నిట్లు పలిచితే! యనిన
నృపుఁడు గౌఁగిటఁజేర్చి నేఁడు నాయందు
నపరాధ మెంతైన నధికమ్ము గలదు
నోర్చికొమ్మనుచును నుచితవస్తువుల

నేర్చి యాతనికని యిచ్చిన నతఁడు
వెలయఁగా వాకిఁట విచ్చేసి పెద్ద
కొలువు చావిడిలోనఁ గూర్చుండి ఘోట
కముల నెక్కుడు జూచి గైకొనుండనిన
రమణ భూపతి హజారమున కేతెంచి
మండలాధీశులు మన్నీలు దొరలు
దండనాయకులు నందఱును సేవింపఁ
బేరోలగంబుండి పృథివీశ్వరుండు
వారలందఱు సైంధవవ్రాతములను
నెక్కి యాడుచు వేడ్క నెల్లరావుతులు
నొక్కరూపమ్మై యుండుటజూచి
యెక్కుడు మీలోన నెవ్వరిందనినఁ
జొక్కనాథుని దెసఁ జూపి రందఱును
నప్పు డాసౌందర్యుఁ డవధారుఁ డనుచు
నొప్పుగా నందఱు నోహో యనంగ
గోరాజగమనుఁ డాగోమాయ హయము
నారోహణావరోహణరోహియగుచు
నెన్నేని విధముల నెన్నేనిగతుల
వరుసతోడుత రాగ వాగెలయందు
మఱి కశాఘాతభూమానమ్ము వాకు
నక్రియాత్మారక్షణలఁ బరాపేక్ష
నీక్రియఁ దురగమ్ము నెక్కుడుగాఁగ
నష్టావధానమ్ము నంది యొక్కఁడె
స్రష్టయు హరియు నాశ్చర్యమ్మునందఁ
జూచి యాపాండీడు చోద్యమ్ము నొంది
యీచొక్కనాథుఁడేయని చాలమెచ్చె
నప్పుడు పశుపతి హయమ్ముపై నుండి
చెప్పెద విను రాజశేఖర మున్ను
తిరువాదయూరుండు దెచ్చిన ధనము
తురగమ్ములకు గాను దొలుత నే మాకు
నిచ్చినఁ గైకొంటి నిదె ఘోటకములు
వచ్చె నేర్పున గొను వసుధేశ ! యనిన
సౌందర్యపతికి నాజనపతి యపుడు

హయము లక్షణముల నెఱిఁగింపుఁ డనిన
వినుము పూర్వమ్మున వేదంబు లందు
వనధుల నమృతంబు వహ్నులయందు
బ్రహ్మాండమునను దిక్పాలకులందు
బ్రహ్మనేత్రమ్ములఁ బ్రభవించె మఱియు
నారట్ట రింఖాణ యవనకంఖాణ
వారాశి కాంభోజ బాహ్లీకదేశ
ములఁ బుట్టు నుత్తమంబులు వానిలోన
వెలయు బ్రహ్మక్షత్రవిట్ఛూద్రజాతు
లందులో రాజవాహము లుత్తమములు
నందు దివాజాత మర్హమ్ముగాదు
నరయ దేవమణికంఠాభరణమ్ము
మఱి బాసికము సుడి మస్తకసమము
పదములు నాలుగు ఫాలస్థలమ్ము
విదితధావళ్యమై వెలసినయట్టి
పంచకల్యాణు లీ భాతిఁ జెన్నొందు
నంచితమ్ముగ గాత్రులందును మిగుల
శుభలక్షణమ్ముల సుడిసుద్దములను
బ్రభవించు హయములు ప్రభువు లెక్కినను
నఖిలసంపదలను ననుకూలమగును
నిఖిలశాత్రవులను నిర్జించు మఱియు
పట్టెడ సుడి గల్గు పాదమ్ము లీసి
కట్టు శోకావర్త కంఠనాళముల
వెన్న నౌదలఁ బొల్లు విసపాది శృంగి
నెన్న బూడిద ముక్కు నేకమస్తకము
మఱియుఁ బిండావర్త మస్తకహీన
మరయ నీమొదలైన యశుభలక్షణము
లీయశ్వముల నెవ్వ రేని నెక్కినను
శ్రీయు నాయువు వారిఁ జెందఁగానోవు
నని మఱియును గల్గు నశ్వలక్షణము
లనువందఁగా వారి కానతి యిచ్చి
రూరాజశేఖర ! యుత్తమంబైన
వారువంబుల యిష్టు వచ్చినవెల్ల

నలియక శత్రుసేనాసమూహంబుల
కలగుండు వడసేయఁగల్గు గుండ్లధిప
సప్తవారాసుల సప్త శైలముల
సప్తాశ్వరథసక్త సప్తాశ్వములను
గడవఁగాఁ జాలు నీకడ గుఱ్ఱములకుఁ
బుడమీశ ! వినుము యిప్పుడ చెప్పవలయు
విదితమ్ముగా వీని విలువ లెట్లనిన
మొదలి తరంబెల్ల ముప్పదివేలు
నడితరంబెల్లను నాలుగువేలు
కడతరం బొకవేయి కంఖాణములకు
నీరీతి వెలనిశ్చయించి యావాద
యూరుఁ డిచ్చిన మేము నొప్పి వచ్చితిమి
మనుజేశ ! యిటు వాగె మాఱుచుకొన్న
వెనుక నా గాదన్న విహితమ్ముగాదు
నిప్పు డీగతి మీకు హితమాయెనేని
నొప్పుకొమ్మన్న నాయుర్వీశుఁ డనిశా
సమ్మతించితిమి నిచ్చట వాగెమార్చి
యిమ్మన్న యుమ్మాటి కిచ్చిన యర్థ
రాశి మాయది యశ్వరత్నముల్ మీవి
యీసభవారెల్ల నెఱుఁగఁ జెప్పితిమి
తమదొకపనులకు నేగున్నవాఁడ
వాదయూరుఁడు నెందువాఁడును గాఁడు
శ్రావణమూలనక్షత్రమ్మునందు
భావించి సకలభూపతు లెల్లవినఁగ
నని వాగెమాఱిచి యారాజు చేతి
కిని నిచ్చె దేవుఁడా కృత్రిమాశ్వముల
నప్పు డాపాండీంద్రుఁ డఖిలకట్నములు
చెప్పించి యిచ్చిన ధీరుఁడై హయము
పైనుండి చండ నాఁ బరగు బెత్తమునఁ
దా నందుకొనిన నాతనిఁ జూచి నృపుడు
కనలిన నది దేశకట్టడ యనుచు
వినిపించి తెన్నవ విప్రవర్యుండు
తటుకున శిశునిపాదము బట్టుకొనిన

నిటలాక్షుఁ డపుడు మాణిక్యవాచకుని
మన్నించి తనదివ్యమకుటమ్మునందుఁ
గ్రొన్నెలతోని పైకొనఁ జుట్టుకొనియుఁ
దనభక్తునికిఁగాను దగు ఫేరవములఁ
గొనివచ్చి గంధర్వఘోటకజాతు
లుగఁ జేసి భూమిపాలున కొప్పగించి
నగజేశుఁ డరిగెను నగుచు నయ్యెడను
హరివిరించీంద్రాదులైన దేవతల
సరవి నంపిన నమస్కారముల్ జేసి
చనుచుండి వారలీ సౌందరేశ్వరుఁడు
తనదాసులకును సంతప్రయాసకుఁడౌనె
యని సన్నుతింపుచు నాత్మ మెచ్చుచును
జనిరి వారలు తదాశ్రమముల కంత
నంగయకణ్ణమ్మ శాలీలఁ జెప్పి
పొంగి నవ్వుచునుండె భూతేశ్వరుండు
నారయుఁడఁ బాండ్రీంద్రుఁ డతిమోదమునను
లాయముల్ నిండఁ జాలఁగఁ గట్టుఁడనిన
వారువమ్ముల నెల్ల వ: స సాహిణుల
వారు గట్టిరి వేఱె వన్నెలేర్పఱచి
యారాజు హర్షించి యలరంగ వాద
యూరున కధికమ్ము లుడుగర లిచ్చి
యతని మందిరమున కనిచి యాపాండ్య
పతి కొల్వువిరిసి లోపలికి విచ్చేసెఁ
దెన్నవరాయఁ డా త్రిభువనాధిపుని
సన్నిధి కేతెంచి సంస్తుతుల్ జేసి
సామగానప్రియ ! సామజవరద !
సామజరక్షణార్చిత పాదపీఠ
సామజముఖజనక సామజశిక్ష
సామవేదస్తుత్య స్వామి సర్వేశ
మాయాశ్వములఁ దెచ్చి మహిపతి కిచ్చి
తే యంచు మలహరు దీక్షితకృపను
దనమందిరమునకుఁ దడయక నరిగి
వినుతింపఁబడియె నా విప్రవర్యుండు

మునులార! శ్రావణమూల నక్షత్ర
మునఁ బ్రతివత్సరంబును నశ్వములను
వాగెనూలుచు లీల వరుస నిప్పుడును
సాగుచునుండును సౌందర్య పురిని
నిదియు నేఁబదియేడు నిటుమీది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
వాతాపిదమనుఁ డా వరమునీంద్రులకు
బ్రీతితో నిట్లనె భూతేశు మహిమ

### ఏఁబదియెనిమిదవ లీల.

నంత నా పాండ్యరాజ్యాఖిలేశ్వరుఁడు
సంతోషచిత్తుఁడై సౌందర్యనాథు
కరుణను వాయువేగము లైనయట్టి
తురగమ్ము లెన్నేని దొరికెఁ బొమ్మనుచు
గడ్డియు కవణముల్ కట్టడచేసి
దొడ్డుగా నామృగధూర్తుల కెల్లఁ
బెట్టించినను నవి బెదరి యేమియును
ముట్టక మోముమోములు చూచుచుండె
నా పాండ్యభూపాలుఁ డట విచారించి
ద్వీపాంతరమ్ముల తేజీలు నివియు
మేఁటి మాంసమ్ముల మెసవుటఁ గాని
పాటించి తృణములు భక్షింప వనుచు
వేఁటలఁ దెప్పించి వేగఁ దోపించి
ఘోటకమ్ముల కెల్లఁ గోసి వేయించె
నవి తమజాతి యాహారమ్ము లగుటఁ
దివిరి మాంసమ్ములు దినుచుండె నంత
నట మూఁడుదినములు జరిగిన పిదప
నిఖిలాత్ముఁ డాయశ్వనికరమ్ము లెల్ల
మునుపటి జంబుకంబుల లీలఁ జేసి
జనులకు మిగుల నాశ్చర్యమ్ము నేయ
వలెనని కృత్రిమాశ్వమ్ముల నెల్ల
వలఁచెను నిజరూపధారులు గాఁగ,
నప్పుడు లాయమ్ములందున నెల్ల
నొప్పుగా నున్నట్టి యుత్తమాశ్వములు

నొకనాఁడు మదిని నన్యోన్యభాషణల
మొకమొకమ్ములు జూచి ముచ్చట నొంది
వనముల లోపల వలసినయట్లు
మనయిచ్ఛ నెల్లఁ గ్రుమ్మఱుచున్న మనకుఁ
ద్రాళ్ళచే వాళ్ళచేఁ దలుగులచేతఁ
గాళ్ళను మెడలను గట్టులఁ బడుచు
నీరాజునగరున నిన్నిభంగులను
ఘోరమ్ముగా మనకును నుండనేల
శివు నాజ్ఞవలన వచ్చితి మిందు మూఁడు
దివసమ్ములుంటి మింతే చాలు మనకు
ననునంత సూర్యుఁడస్తాద్రికిఁ జనిరా
ఘనముగాఁ బర్వెఁ జీకట్లు నత్తఱిని
నడురేయి సాణు లందఱును నిద్రింపఁ
దడయక మనకిది తరువాయి యిపుడు
పోదాము మన మన భూముల కనుచు
నా దేవనిర్మితంబైన యశ్వములు
నున్నతిలీలఁ జెన్నొందు దేహములు
సన్నంపురూపులై సాగిన యంతఁ
గాళ్ళను మెడలను గట్టినయట్టి
త్రాళ్ళు నన్నియు వీడి తడయక నవుడు
వన్నియుఁ గూడక నా యముననను
మున్నున్న హయపోతముల నెల్లఁ గలచి
మొనసి యా సాణుల ముక్కులఁ జెవులు
గొంతికలు మొదలంటఁ గొఱికి పైకుఱికి
రవములు సెలఁగ భైరవము లన్నియును
దివిరి లాయమ్ములు తెగువతో వెడలి
కన్నడి సన్నట్లు కాననమ్ములకు
నన్నియుఁ గూడఁ జయ్యన జాఱె నంత
నా రాత్రి వేఁగఁగ నామఱునాఁడు
భీతులై డాఁగి తప్పించుకున్నట్టి
పాడివారెల్ల కోపాడి యందఱును
గూడుకచని రొక్క ఘోషమ్ము తోడ
నావసుధేశుని నరుఁగాంచి మ్రొక్కి.

దేవ యీరాత్రిగాఁ దెచ్చి యా వాద
ఘోరుండు మనకును నొప్పించినట్టి
గారువన్నెలు ఘోరవంబులై సగము
ప్రొద్దున నీరెయి పొసఁగ నన్నియును
పెద్దైన మేనులు చిన్నలు జేసి
మెడకొళ్ళ నున్నట్టి మేటిపగ్గములు
సడలించుకొనుచు విచ్చలవిడి తోడ
నట్టులెత్తుక రాఁగ నటుకని యేము
నొత్తొడి పంచల నొదిగిలి మంత
గుట్టంపుఁ గొదమల గుదులు కంఠములు
ఎట్టుగా గొలికియు వడిఁ బాఱె నంత
వెట్టు లెత్తినయట్లు వెపకి సాణులను
గొట్టెలఁ ఉన్నట్లు కోలలఁ దెలికి
మొట్టులుగాఁ జెవుల్ ముక్కున గొలికి
బొట్టులు సిందంగ భూరిరక్తములు
జుట్టులు గొనుచును సోలి సొక్కుచును
గట్టునఁ ద్రేన్పుచుఁ గాలుద్రవ్వుచును
నెట్టఁగాఁ జూచుచు నెవ్వరిఁగన్నఁ
దట్టున గవయుచు జిమ్మి కేఁగుచును
గట్టు మఱుంచును గునిసియాడుచును
నట్టునఁ గవలుచు నుతికి పైఁబడుచుఁ
దెట్టుదాఁటులు దాఁటి చేరి యాడుచును
జట్టున నయ్యశ్వశాలలు వెడలి
బెట్టుగా నూళలు వెట్టుచు నగరు
పట్టణమ్మును వెడలి పరువెత్తె నధిప !
యని కొల్చునందఱు నటు విన్నవించి
నను రాజు మిగులఁ జింతాక్రాంతుఁడగుచు
దురదుర తురగమందిరమున కరిగి
పరికించి వెరగంది పరితాప మంది
కొలువుపావడికిఁ గ్రక్కున వెళ్లివచ్చి
నిలుచుండి దొరల మంత్రివ్రాతములను
రప్పించి హయము ఘోరవములై చను
చెప్పి యీవిధమును నేయుఁబలెల్ల

వాదయూరుని మృషావాదముల్ గాక
నేదేశమునఁ గాన మీ యద్భుతములు
ననుచు వాదపురీశు నపుడు దూతలను
బనిచి యాక్షణమునఁ బట్టి తెప్పించి
దారుణాకృతితోడ ధారుణీశ్వరుఁడు
నోరి! యీరీతి సేయుటెట్లు నీవు
నా దేశమునఁగల నక్కల నెల్ల
సాధులఁ జేసి యశ్వములంచుఁ దెచ్చి
యెడవానినో తెచ్చి యికమీఁదటంచు
నోడక మాచేత నుడుగరిప్పించి
తగ నింద్రజాలవిద్యలు పన్న నీకుఁ
దగునె మానగర నర్థముగొంచుఁ బోయి
మంత్రులందఱు నీక? మంత్రముల్ జేసి
తంత్రముల్ బన్నంగఁదగునె నీకగునె
కలధనమ్మెల్ల నక్కలకుఁ బాలాయెఁ
దొలుతను నున్నట్టితురగముల్ పోయెఁ
జాలు మాధనమెల్ల సరగ నిచ్చెదవు
బాధ నొందక కస్తిఁబడక నేవేగ
సాధువర్తనల! నీసరి మంత్రులెదుర
మానక్క విడక సన్మానమ్ము చెడక
పూని మాధనము నిక్కడఁ బెట్టు మనిన
వాదయూరుఁడు ప్రతివాదియై యేమి:
పోదు నాకును హయంబులకును నీదు
ముందఱ గుఱ్ఱాల మొదలివర్తకులు
నందఱు నెఱుఁగఁగ నప్పగించితిని
వాగె మాఱిచి యిచ్చువారిచే ధనము
వేగంబె యీరీతి వేడుకొమ్మనిన
నా విభుండిట్లనె నతని మేమెఱుఁగ
మీరు మాహయముల నిచ్చుట తగవు
సభవారి నడుగుము జాడతోననఁ
బ్రభువన్నగీతిని బలికిరందఱును
దిరువాదయూరుఁ డింతియ కాని మున్ను
ధర యథా రాజా తథా ప్రజా యనుచు

క్రొత్తలే యీమాట కాదలేదు మున్న
చిత్తస్థి కొలఁదికిఁ జేసుకొమ్మధిప
తలఁప రాజానుమతము ధర్మమింత
నిలఁ జొక్కనాథుండు నెఱిఁగినఁ డనినఁ
జొక్కనాథుఁడు నిన్న సొరిదిగా నిట్లు
నక్కలఁ జెప్పనినాఁడొకో! వీనిఁ
గొనిపోయి మున్న దాఁగొనిపోయినట్టి
ధనము చెప్పనుచు బంధనముగాఁ జేసి
యడ్డపాతులఁ బెట్టి యందలు గిట్టి
దొడచట్టుగఁ బెట్టి త్రోచి పైఁబెట్టి
గ్రుడ్లు వెళ్ళుకంగఁ బైద్దైనయట్టి
దుష్టుం బుచ్చుక కొట్టి ద్రోహిని బట్టి
కాళ్లుచేతులుఁ గట్టి ఘనముగాఁ గొట్టి
ప్రేళ్లను దగగిట్టి వెసఁ గట్టికొట్టి
సరగున ధన మవశ్యము చెప్పుటంచుఁ
దరువుకాండ్లకు నిరుత్తగవుగా నిచ్చె
నార నామాణిక్యవాచకుఁ బట్టి
యారీతిఁ గొనిపోయి యటు గస్తిసేయ
నాచొక్కనాథుని నపుడు మాణిక్య
వాచకుండు ననేకవిధస సన్నుతులు
సేయుచునుండె నిశ్చేష్టుఁడై యనిన
నాయగస్త్యునికి నిట్లనిరి యామునులు
శివభక్తులకుగాను శివుఁడు దానెట్లు
శివముల హయములఁ జేయుట లెట్లు
మునినాథ యాహయంబుల జంబుకముల
తనువుల సేయుటింతయు మహేశ్వర్య
మామహాదేవుని యానందశీల
వేమాఱు వినవిన వేడుకయ్యెడును
నావలి లీల వాకానతిమ్మనిన
భావించి యాకుంభభవుఁ డిట్లులనియె
నిదియు నేఁబదియొన్మిదిటమీఁదిలీల
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యిల్వలదమనుఁ డాయీశ్వరు మహిమ
బల్వగల నా జెప్పె భక్తితోడుతను

## ఏబది తొమ్మిదవ లీల.

ఒప్పుగాఁ దిరువాదయూరదేవుండు
పరమేశ్వరు నాత్మ భావించి
హరహర జగదీశ యభవ భూతేశ !
గిరిశ మహేశ్వర గిరిజేశ యీశ !
శాంత శాశ్వత శివ స్థాణ్వగ్ని నేత్ర !
కంతుసంహార భద్ర కాలాగ్నిరుద్ర
పశుపతి శర్వోగ్ర భర్గ ఫాలాక్ష !
శిశిరాంగ భస్మాంగ శ్రీ సర్వరూపాంగ !
కలకంఠ ధూర్జటి ఖట్వాంగపాణి !
పరశు త్రిశూలకపాలాంకహస్త !
హాలాస్యపురనాథ ! హే చొక్కనాథ !
యీలాగు నను సేయుటది నీకుఁ దగునె
యని సన్నుతుల్ జేసి యాత్మఁ జింతింప
మనమునఁ గృపమీఱ మధురాపురీశుఁ
డా చొక్కనాథ మహాదేవుఁడపుడు
ప్రాచేతసునిఁ దలంపఁగ వచ్చి యతఁడు
[illegible]దండ సాష్టాంగ మతిభక్తిఁ జేసి
ముందఱ నిల్చి ప్రహ్లాదమానుఁడై
ఓంనమశ్శంకర ! యోంనమస్తు !
పనియేమి నాస్వామి ! పనియేమి దేవ !
పనియేమి నీభృత్యుఁ బని చాలు నన్ను
నని సన్నుతులు సేయ నాస్వామి యతని
కనువొంద నిట్లని యానతి యిచ్చె
వాదయూరుఁడు నీకు వలయు భక్తుండు
మేదినీశుఁడు వానిమీఁద నాగ్రహము
సేయుచుఁ గరము శిక్షింపుచున్నాఁడు
నాయుపద్రవము వాయఁగఁ జేయవలయు
వరుణ ! నీవతివేగ వర్షించి వైఖ
ధరఁ బొర్లి మధురపైఁ దగఁ బాఱఁజేయు
మనియానతీయ మహాప్రసాదమ్ము
ననుచు నావరుణుండు హరు నాజ్ఞఁ జేసి
గుఱియింప నావైఖ కూలముల్ ముంచి

పొరిఁబొరి యందంపఁ బొరలి పొఱఁగను
గట్టు కాలువలెల్ల గట్టిగాఁ ద్రెంచి
పట్టణమ్మొరనుక పారె నయ్యెడను
నావసుధేంద్రుండు నచ్చోటి కరిగి
వేవేగ మధురపై వెల్లి రాకుండ
నిల్లాదిగా నూర నెల్లరఁ దెచ్చి
కల్లోలబంధమ్ము గావింపుఁడనుచు
సేనాధిపతుల కాక్షితిపాలకుండు
నానతిచ్చిన వార లతిరయమ్మునను
బరిచారకులఁ బంపి పట్నమ్ములోనఁ
బరికించి యాంపఱఁ బట్టి తెప్పించి
పిన్నపెద్దాదిగాఁ బేర్కొని వచ్చి
పన్నుగా నాకట్ట పంచి వైచినను
బిట్టవ్వ యనుచొక్క పేదపెద్దమ్మ
పిట్టమ్ము తనపొట్టు పెంచుక నెలమి
నెడలేక నొడయులు నెందఱు నైనఁ
దడయక వచ్చినఁ దగఁబిట్టు వెట్టు
నట్టి పిట్టవ్వకు నట్టి యావైఖ
కట్టఁ గొల్పొంచిన కట్ట లేకున్నఁ
బట్టి యామెను నీడ్చి పరిచారులెల్లఁ
జుట్టుక కట్టుమంచును బాధసేయ
నార్తరక్షణ పరాయణుఁడైన యాది
మూర్తియు నైనట్టి మూర్తిత్రయాత్ముఁ
డారూఢఁ జొక్కనాయకమహాదేవుఁ
డాయవ్వ తనమీఁద నతిభక్తి గాన
జడలెల్లఁ జుట్టుగా సవరించి కట్టి
పొడలవన్నెలదట్టి పొలుపుగాఁ జుట్టి
తనచేతి పరశుకుద్దాలమ్ముగాఁగఁ
బునుక కప్పెర మంటిపుట్టిక గాఁగ
గావించి రా కూలికాని చందమునఁ
దా వచ్చి యామె ముందఱ నిల్చి పలికె
నే కూలికాఁడను నీవేమి కూలి
నాకుఁ బెట్టెదవన్న నగజేశుఁ జూచి

యిట్టి కోమలరూప మిట్టిసౌందర్య
మిట్టి నీవీ మన్ను నెట్లు మోసెదవు
నన్న నాపిట్టవ్వ కాస్వామి యనిరా
మన్నునీళ్లను మోసి మా తలచూడు
జడగట్టె నెప్పుడు సహజమ్ము మాకు
నొడలేదు మాటలకేమి యిచ్చెదవు
ననిన నాకుద్ది ద్రవ్యములేదు నాకు
దినమును చిట్టిమ్మ తిరిగెడుదానఁ
బిట్టు నీకును గూలిఁబెట్టెద గాని
గట్టి మన్నుగ మోచి కట్టుమా ! కట్టు
యనిన నాసర్వేశుఁడా చొక్కనాథు
మనసును నీమనసును నిమ్మహి నొక్కటౌను
పిట్టవ్వ యటనాకుఁ బెట్టుము కూలు
గట్టిపిట్టుగ నీవు కడుపారఁ బెట్టు
మనిన నాకుద్దియా నట్లన నేల
నీకును మనసూరా నెంతయుఁ బిట్టు
గావించి పెట్టెద గాని నాపాలు
వేవేగ ముగియంగ వేసిరావలయు
నారాజు పరివారు లందరుఁ వచ్చి
రారాపులై నన్ను రాయిడించెదరు
ననుచు నప్పుడు నున్నయట్టి యాపిట్టు
తినుమని పెట్టినఁ దెమ్మని దట్టి
పొరలోనఁ బెట్టుక పోరాద ననుచుఁ
బొరిపొరి యాపిట్టు బొక్కాడుచును
మెచ్చుచుఁ నాకట్టమీఁదికి వేగ
వచ్చి యందున్నట్టి వారలఁ బిలిచి
మంచి మేలైనట్టి మంచివారలకుఁ
బంచిపెట్టక తినఁ బాడిగాదనుచుఁ
బెద్దలు చెప్పంగఁ బ్రియముతో నెపుడు
వొద్ద నుం డేలిందు నొప్పుగా ననుచుఁ
బాటించి యాపిట్టు వారికిఁ బెట్టి
పాటలు పాడుచుఁ బనిసేయు వారి
నాటలాడింపుచు నాపిట్టు దినుచుఁ

దాఁటులు వేయుచుఁ దగ నుంచు నంత
నటు నధికమైన నాపాండ్యవిభుని
భటులు నేతెంచి నీ పనియేది చెపుమ !
యీలాగునను మన్ను నిటు మోయకున్న
నేలాగు నాలాగు నెఱుఁగనే యన్న
ననియె నాసర్వేశుఁ డదియెట్లు నేను
మునుకొని మన్నెల్ల మోసినవాఁడ
మఱి యెవ్వరైనను మన్ను మోయంగ
నెరవరి యెవ్వఁడు నేను గాకనిన
వారు నిజమని యవ్వలి కేగిరంత
నారీతి మఱియును నాటలాడుచును
దిరిగి పిష్టవ్యమందిరమున కరిగి
హరహరా యనుచును నచటఁ గూర్చుండి
మే నెల్ల భారమై మెడ ద్రిప్పరాదు
వానగాలనక నీవంతు మన్నెల్ల
మోసి కట్టితి నేనె మొనసి యాకట్ట
నా సేయ వని చొక్కనాథుండె యెఱుఁగు
నా మాట లిన్నియు నమ్మవైతేని
నోముద్ది పేరఁజూతు రావమ్మ
యని చెట్టఁ బట్టిన నాముద్ది నమ్మి
తనరంగ నాపాలిదైవమై వచ్చి
రాచసేవకులచే రారాపు లేక
నాచోటఁ గలిగితే నా తండ్రి యనుచు !
నప్పు డాయితంబైన యా పిట్టువెట్టి
యిపుడు నింకొక పట్టు నేగి యచ్చోట
గట్టిగాఁ గట్టుమీ కడఁకతో ననిన
నట్లె చేసెద నంచు నాపిట్టు గొనుచు
భక్షింపుచును వేడ్కఁ బరగ నందులకు
నాక్షణమ్మునఁ జేరి యందఱుగట్టి
నట్టి యాకట్టఁ దాగట్టిగా గట్టి
నట్టి భాతిని నది యటు దెగఁగొట్టి
తానును గట్టక ధాతృకపాల
మైన యాపుట్టిక నటుఁ దల్రకందఁ

బెట్టుక పాటలు పేర్కొని పాడు
నట్టి వేళల గణితజ్ఞు లేతెంచి
మునుకొని గట్టిగా మోచినవాని
మును వ్రాయవలె నన్న ముందరిఁ బాఱి
మెడ యోరగాఁ బెట్టి మెయి ధూళిగట్టి
తడయక వారిముందర వచ్చి నిలిచి
మొదల నే నీ మన్ను మోచిన వాఁడ
వదలక మును నన్ను వ్రాయంగవలయు
నా పేరు చొక్కఁడు నను వ్రాయుఁడనిన
నా పరివారమ్ము లదియెట్లు వీఁడు
పాటలాటలఁ బండువడి ప్రొద్దుపుచ్చి
యాటగి ఫుచు వచ్చి నాఁడు వీఁడిపుడు
మన్నెల్ల మోఁచిన పుణ్మను మీరు
మున్ను వ్రాయక వీని మున్నేల వ్రాయ
ననిన నా సౌందర్యుఁ డవియెట్లు మన్ను
మునుకొని నాయట్లు మోయంగఁ గలరె!
నిక్కమై యతఁడయు నే మోయ వీర
లెక్కకై నన్నును వోడఁ గొట్టెదరు
ననిన నా మాత్రితు లెట్లని గిట్టివాఁడు
మనమీఁదఁ గొండెమ్ము మఱిఁ జెప్పె ననుచు
నీవెవ్వఁడిట! మఱి నీకుఁ బనేమి?
యేయూర నుందువు నెవ్వరివాఁడ
వనిన నాపరమాత్మ యన్నందమ్ము
లెనయఁ గల్గియు దండ్రు లెవ్వరు లేరు
పెద్దగా సౌందర్యుపేరు సెప్పికొని
పెద్దను చిన్ననై పేర్కొని నేనె
యేకాంగినై యుండ నీపురియందుఁ
జేకొని యొకమూలఁ జేర యుండుదును
సొలయక నాపేరు చొక్కఁడటంచుఁ
బలుకుదు రెల్లరుఁ బాటించి నన్ను
బ్రతుకుకై యీమంటిరాసులు నీళ్ల
సతతమ్ము మోయంగ సగమయ్యె మేను
పుట్టె యస్థులు జర్మమును నెక్కె మేన

బత్తిగొల్లను మీరు పరికింపనేల
నను వ్రాయుఁడన్నను నయమొప్ప వార
లని రిఁకనైనను నామన్న వ్రాసి
నీ పాలుగట్టుము నిన్నుఁ జూచినను
గోపించి మాకును గొట్టఁజెయ్యాడ
దీరీతి మఱియును నిట్లుంటి వేని
నారింతు వీపున నత్తును గాఁగఁ
గాఱులాడుచు నోరుగలిగిన వాని
కూరోర్వ దనునాటి యొగినిఁ జూచినను
జాలేకరులు జూచి యతనిఁ బిట్టవ్వ
కూలికాఁడనుచుఁ బేర్కొని యల్లఁ దన్ను
వాగిలోపల మున్ను వ్రాసి రయ్యెడను
వారి నోరార్చి తావచ్చుచోఁ బుటిక
మోమున మఱుఁగుగా ముసి ముసి నవ్వు
నో మఱి యచ్చోటఁ దొల్లిఁటి యట్ల
నుండి గానమ్ము సేయుచునుండు నేళ
బాండీడు నా సేతుబంధనంబపుడు
జూడ నేతెంచినచో నెల్లవారు
గూడుక యుండి పేర్కొని తమ బాగ
ములు గట్టుచుండంగ మునుకొని రాజు
నలరంగఁ జూచుచు నరుగుచో నెదుర
నిది చూచి యీపాలు నెవ్వరి దిచటఁ
బదిలమ్ము సాలమ పట్టుకరండు
మదముగా నించుక మన్నైనఁ దెచ్చి
చదరమ్ముగా వేయు చందమ్ము గాన
మునినఁ బాండీనికి నందఱిట్లనిరి
మనుజేంద్ర ! యిందుకై మానవుఁడొకఁడు
పిట్టవ్వ యనువాక్క సేదాపె పా
కట్టెడ నని కూలికాఁడునై వచ్చి
యల్లడె పవళిచి యందున్నవాఁడు
చల్లఁగా నీడను చారలాడుచును
నవిన నా రాజు నత్యంతకోపమునఁ
జని మీరు వాని నిచ్చటికిఁ దోడ్తెండు

పొమ్మని పనిచినఁ బోరిపోరి వచ్చి
పట్టుకరమ్మనెఁ బాండీఁడు నిన్ను
రారమ్ము వేవేగ రాజు సంగడికి
నీరీతి జాగులు నెఱిఁగి ర దఱును
ననిన నాస్వామియు నామాట లెల్ల
విననట్లు నిద్రించు విధమున నుండి
దగ్గఱి యట వచ్చి తట్టిలే పినను
దిగ్గనలేచి నల్దిక్కులు జూచి
యా రాజు నటుఁ గాంచి యతిభయం బంది
యారీతి నట వేగ నందఱు దేఱి
పరశు కుద్దాలమై పట్టి, కపాల
మరుదైన పుట్టికయై యుండఁ జేసి
మందమందస్మ్నాన మున్నందు కొనుచు
నందంద దగ్గఱి యట కేగునంత
నక్కించి గుత్రాని నారాజు క్రోలి
జక్కించి యిదియేమి చయ్యన రాఘు !
ననుచు నాస్వామిని హస్తాన నున్న
కనకదండమునఁ దక్కన వీఁపుగొట్టెఁ
గొట్టిన నప్పుడా కొట్టుకోఁ బోయి
కట్టపై నాపుట్టికను నున్న మన్ను
గట్టుకో వైచి యాక్షణమునఁ దాను
నట్టె యదృశ్యుఁడై యరిగె నాస్వామి
యటుమున్నె యపుడు పాండ్యావనీశ్వరుఁడు
పటుగతి నాముద్దిఁ బట్టిఁ దెమ్మనుచుఁ
బరిచారకులఁ బంపఁ బరువిడి వారు
పఱతెంచి యాముద్దిఁ బట్టి యీడ్వఁగను
నాయవ్వ యప్పు డాహాకార మెసఁగఁ
గాయజాంతక నీలకంధర ! శర్వ !
తోయజాసనవంద్య తోయజనేత్ర
పాయక యార్తరక్షణపరాయణుఁడ
కడఁగి నిమ్మవ్వ తోఁకటిపెట్టు కోర్కి
కడువేడ్కఁ బ్రోచిన కరుణాకటాక్ష !
యంటరాకున్న చోడవ్వ యెంగిలియు

మాయాప్రపంచ ! యో మాయాస్వరూప !
శివశివ త్రియక్ష ! జితపురాధ్యక్ష !
భవభవ పద్మాక్ష బ్రహ్మేంద్రరక్ష !
హరిహర దైవతాధ్యక్ష ! యుగ్రాక్ష !
గరుడకిన్నరయక్షగంధర్వరక్ష !
అమృతాంధకదక్షహంకారశిక్ష
సద్భూతిరుద్రాక్ష ! సర్వాంగరక్ష !
భీమ ఫాలాక్ష ! యోధిష్ఠాన్నభక్ష !
శ్రీమధురాధ్యక్ష ! శ్రీవిరూపాక్ష !
యఖిలాంతరిక్ష వ్యాపారసాక్ష ?
యఖిలాగమోత్రదక్ష ? యంబికాధ్యక్ష
సర్వలోకారాధ్య ! సర్వజీవాత్మ !
సర్వదేవశరణ్య ! సర్వేశ యీశ
యోకుండలినుకుండలో యంబరాంబ
రోకాబ్ధికాముక యోకాలకాల!
నీమాయ లెవ్వరు నియమించువారు
నీమాయ లెల్లను నీవెను దెలియు
విశదమ్ముగానంచు వినుతింప నప్పు
డశరీరియై స్వామి యతని కిట్లనియె
మఱి వాదయూరుంపు మాభక్తుఁడగుటఁ
పురగములఁ గొని తేను దొడరి నీవతనిఁ
బాటించి యిచ్చిన పస ధనమ్మునకును
మేటి యహాయముల మేమె పట్టితిమి
వంచింపకట మేమె వైఖరప్పించి
మించి పిట్టుకు మన్ను మేమె మోచితిమి
కొంచెమై నీచేతఁ గొట్టున బడితి
మంచు నాతనిఁ బుచ్చి మతనికిఁ గాను
నీలాగునను మేము నెన్నే నిగతుల
వాలాయ మిటుసేయ వలసెను మాకు
పాటించి యిటుగానఁ బాండ్యభూపాల !
నంటు లేటికి వాగె మార్చి యేమొసఁగు
ఘోటకంబులను స్వైకొంటివి నీవు
బాగుగా జగమెల్లఁ బాటించి చూడ

వాగెమార్చిన నీకు వశులెందుఁ గలరు
నీకెక్కునదిగాన నిఖిలమ్ము నెఱుఁగ
నీకేల నతనిపై నీ కోప మనఘ !
యటుగాన నీ కావ లతనిపై నేల!
దటుకున విడుమన్న ధరణీశ్వరుండు
కడు విస్మయంబంది కడకతో నదియు
వరచొక్కనాథుని వాక్యమ్ములనుచు
పులకితదేహుఁడై పొలుపొంద నపుడు
వెలయంగ నాతని వేగ రావించి
పరమేశ సద్భక్తివరుఁడ నీనోట
నెఱుఁగక జేసితి నెల్లలోఁ గొనుము
నిరతుగా నీవు నీయిచ్చల నుండు
మురుదారగా నంచు నతివేడ్క నంపె
నంతట నతివేడ్క నాతఁడేతెంచి
యెంతయు నాదేవు నెలమిఁ బ్రార్థించి
కొన్నాళ్ళ కాస్వామి కృప చాల మీఱి
పొన్నాంబలమునకుఁ బోయి యాస్థలి ని
ఫలితముక్తితరంగ పాపవిభంగ
కలితపుణ్యాకాశగంగ సత్సంగ
నిర్మలాంబుతరంగ నిఖిల ప్రసంగ
పూర్ణ విస్ఫురితాంగ కూలానుషంగ
స్థిరపుండరీకాంబుతీర్థ మనంగ
సరవితోడుత నభ్రసరసి యనంగఁ
దగుపేళ్ళ నమరంగఁ దగు శివగంగ
నగణితమ్ముగ నంగజాంగ భస్మాంగ
సంగభాగమ్మున నా సర్వమంగ
ళాంగీకృతుండు గంగాధరుండతని
కభిషేక సంప్రాప్తమైన యాసరసి
నభిలాషతోడుత నందందఁ జేరి
యందుఁ గృతస్నాన మతివేడ్కఁ జేసి
క్రందుకొన్నట్టి దుష్కర్మముల్ ద్రోచి
యంబరకేశుని నంబరాంశుకునిఁ
దుంబురునారదస్తుత్యు ననాది

పరమంబు నా చిదంబర మూర్తియైన
పరమేశ్వరుని యగ్రభాగంబు కేగి
బహులీల లక్షించి ప్రణమిల్లి నిలిచి
సహిత పంచాక్షరీ మంత్రయుక్తముగ
నాతండు ప్రియు నావాదయూరు
డాంతభక్తి నిట్లని సన్నుతించె
నీలకంధరాయ నమశ్శివాయ
యానందతాండవాయ నమశ్శివాయ
యమృతాంశుశేఖరాయ నమశ్శివాయ
యమృతాగ్నిలోచనాయ నమశ్శివాయ
యఖిలలోకాంతరాయ నమశ్శివాయ
యఖిలైకరక్షణాయ నమశ్శివాయ
యజగవ కార్ముకాయ నమశ్శివాయ
యజశిరశ్ఛేదనాయ నమశ్శివాయ
యాది మధ్యాంతరాయ నమశ్శివాయ
యాదిపరాపరాయ నమశ్శివాయ
పావజహరణాయ పాపనాశాయ
దేవదేవ నమోస్తు తే శంకరాయ
యని స్తోత్ర పఠనంబు లమరంగ జేసి
వినతుడై యష్టాంగవిధుల సేవించి
సంతోషమున బొంది సరభసమ్మునను
సంతర్పితుండై యంతట మరలి
వడిమించి మఱియును సేవింప పాదంబు
గను వేడ్క దర్శించి ఘనపుణ్యుడగుచు
నావాదయూరుండు నపుడు ...
... వచ్చి నగలోకనుత్యయైనట్టి
యంబ కరీటాంచి ... బాలేందుబింబ
బింబఫలాధర బింబ మదంబ ...
నంబిక జగదంబ నాంబికేయాంబ
నంబరాంబర మంగళాంగిలాలంబ
... కామసుందరి శ్రీమహాదేవి
భవనమ్మునకు నేగి భావించి కాంచి
యాదేవి నతిభక్తి యమరంగ బూజించి

వేద మంత్రమ్ముల వినుతించి మఱియుఁ
శర్వాణి రుద్రాణి శాంభవి యార్య
పార్వతి దుర్గ యపర్ణ హైమవతి
కాళి భవాని దాక్షాయణి గిరిజ
మాలిని మాతంగి మాయాస్వరూప
నానందవల్లిఁ గాత్యాయని గౌరి
జ్ఞానార్థరూపిణి జ్ఞాన కౌమారి
శంకరప్రియ మహాజ్వాలి కాపాలి
కంకాళి భైరవోంకారి హ్రీంకారి
యని సన్నుతించి యాయంబ సత్కరుణ
నను వందగాఁ గాంచి యచ్చోటు వెడలి
తిరువాపనూరుఁ డాతిరుపంగలను
స్థిరముగా నాదేవదేవు సత్కృపను
దిరువాచకంబును దిరుమంత్ర మెలమి
వరుసతో నాతిరుమంబల కోప
లరయ నీ స్తోత్రమ్ము గాత్ర శోభిల్ల
విరచించి వేర్వేఱ విశదంబుగాఁగ
నాధిక్యమైన యజ్ఞానముల్ ద్రుంచి
మాధుర్యపురికి నెమ్మదిఁ బోయి మఱియుఁ
సౌందర్యనాథుని సద్భక్తిఁ గాంచి
యందంద సుజ్ఞాన మధికమై పొరలి
వాదయూరుఁ జను కృపావరలక్ష్మి గాంచి
యాదేవునం దైక్యమయ్యె నయ్యెడను
నొరవుగా నరఁ దప్పు డొసరించినట్టి
శివవాచక స్తోత్ర దివ్య మంత్రంబు
ప్రచురమై సర్వేశ్వర స్థానములను
బచరించి సద్భక్తిఁ బఠియింతురెప్పుడు
మఱియు నాపిట్టుకు మన్నందు కరణిఁ
గరమొప్ప నేటేట గదలు నాస్వామి
యిదియునేఁ బది తొమ్మి దిటమీఁది చరిత
ముదముతో జెప్పెద మునులార వినుడి
సన్నంగ నీలీల నెవ్వరు నైన
విన్న వ్రాసినఁ జదివిన పుణ్యపురుష

లాయుశైశ్వర్య సంప్రాప్తులై మఱియుఁ
బాయక శ్రీచొక్కపతి సేవలందు
నాసక్తులై సదానందాత్ము లగుచు
భాసుర సాలోక్యపదవిఁ జెందుదురు

## అఱువదియవ లీల.

అంత నామధురమహాపురంబున న
నంత గుణాఢ్య పాండ్యాధిపు వంశ
మునఁ గుబ్జ పాండ్య భూభుజు డుద్భవించి
తపఁ దారఁ బాండ్యభూతల మేలుచుండి
యతఁడు జైనులఁ గూడి యధిక చార్వాక
మతమున శైవసమ్మతుఁడు గాకపుడు
భూతిరుద్రాక్ష వికుక్తుఁడై యిట్టి
భాతిని సౌందర్యపతి సేవ మాని
దనవద్ది దొరలు ప్రధానులందఱును
దనరీతి జైనమతంబుఁ జేపట్టి
శైవమ్ము మదికి నసహ్యమై పాండ్య
భూవరుం డొరంత బ్రొద్దు "నమో రు
హాంతాగ" యనుచును నాత్మదలంచుఁ
గొంతకాలం బిట్లు గొనసాగుచుండ
నాపాండ్యపతి దేవులైన యాచోళ
భూపాలుని కుమార్తె పుణ్యచారిత్ర
మంగయకర్ష సన్మంగళాకర్ష
నాకోమలాంగిని నాచోళవిభుఁడు
నాకుబ్జ పాండ్యనికతివేగఁ బెండ్లి
చేసి యంపుచును నశేషవస్తువులు
భాసితమ్ముగ నిచ్చి పరమానురాగ
చిన్మయాత్మకు గులశేఖరుండనెడి
సన్మంత్రి నామెకు సచివుగాఁ జేసి
యింపైన బుద్ధుల నైన్నైనిఁ గఱపి
పంపెను మాధుర్య పట్టణమ్మునకు
నా మంత్రియును మంగయాకర్షయమ్మ
వామపాండ్యని దావర్తనఁ జూచి
శైవమ్ము విడిచి యాజైనుల మతము

భావింపుచున్నాఁడు పార్థివేశ్వరుడు
పరికింప మనకిది పాటి గాదనుచు
ధరణీశు దేవియు దండనాయకుఁడు
నుదకమ్మును విభూతి యొప్పఁగా నెపుడు
నుదుట ధరింతు రొండొరు గోప్యముగను
నివ్విధంబున వార లీశ్వరు భక్తి
భావంబు నందునఁ బరిపూర్ణులగుచు
నా చోక్కపతి తమ యధ్యాత్మలందుఁ
జూచి మ్రొక్కుచును బ్రస్తుతులు నేయుచును
నున్నఁడు జైనుల హింసించి శైవ
మెన్నఁడు ప్రజలుచో యీశ్వరా! యనుచుఁ
దెలుపవయ నా మంత్రిశేఖరుం డపుడు
దలపుచునుండె గంటమీఁద మఱియు
మునులార! యా చోళభూమిలోపలను
ననుపమంబైన శియ్యాళూరి యందు
నుండును నొక బ్రాహ్మణోత్తముండతఁడు
కౌండిన్య గోత్రుండు ఘనశైవవరుఁడు
నాతని గర్భమ్ము నందున మిగుల
ఖ్యాతిగాఁ బ్రమథ నాయకుఁ డాదికారు
ణంబుగా జనియించి నడిచి యాడుచును
నంబ వెంటను నేఁటి కరుగుచో నచట
యశరీరియై వచ్చి యాజగదంబ
శిశువును గాంచి యంచితమైన తనదు
పసిఁడికుండలఁ బోలు పాలిండ్ల పాలు
పసి దీఱఁ ద్రావించి భక్తి విచ్చెనె
నా నిమిత్తంబున నాబాలునకును
జ్ఞానంబు గలిగి సుజ్ఞానసంబంధుఁ
డను నామమున మహా ప్రాజ్ఞత మెఱసి
ఘనతరశివ భక్తికలితుఁడై యపుడు
వేదశాస్త్రపురాణ విద్యల నెల్ల
బాదరాయణునకుఁ బ్రతియనఁ బరగి
శరమొప్పఁ దిరువళశాడనుపురము
కరుదెంచితిరునావుకరశరు డాను

విమలసుజ్ఞాన ప్రవీణమానసుఁడు
ప్రమథనాయక భక్తిపరుఁడుండె రంత
నాపాండ్యభూపాలు సర్వాంగలక్ష్మి
నీపాటవీనాథ నిజభక్తచరిత
చోడరాజ తనూజ సుజ్ఞానతేజ
భేదధిపోత్తంస విశ్వప్రశంస
ఘనపూర్త యామంగయక్కర్షయమ్మ
తన మంత్రివరున కెంతయు నానతిచ్చెఁ
" పాండ్యభూమి సమస్తభద్రాగమంబె
నిండి శైవమ్ము తూష్ణీకృతంబయ్యెఁ
జ్ఞానసంబంధు నిక్కడకు రావించి
యా నగ్నకులమెల్ల నడఁపంగవలయు "
నతనినిఁ బిలిపింపు మతివేగ ననిన
నతివేడ్కఁ గులశేఖరామాత్యవరుఁడు
ఖర్వపాండీడు నిక్కడను నీరీతి
సర్వజ్ఞులును దాను సర్వజ్ఞభక్తిఁ
బాసియుండుట వారు ప్రబలమైయుంట
నా శైవసమయంబు లట్లుండుటయును
నా వర్తమానమ్ము లన్నింట కతని
వేవేగ మధురకు విచ్చేయుఁడనుచుఁ
దనకమ్మ వ్రాసి యాతనికినిఁ బనిచె
ఘనమైన తిరువళ్లక్కాడికి నంత
నాలేఖఁ జదువుక నప్పుడు జైన
కోలాహలుఁడు శైవకుశలుండు శివుని
నమ్మినభక్తుఁ డెంతయు వేడ్క జ్ఞాన
సమ్మంధుఁ డధికాష్ట సాహస్ర శిష్య
గణమును దిరునావుకర్షరు దాను
ప్రణయను నాత్మలో దీపింపఁ జేసి
మధురాపురమునకు మహిమతో వచ్చి
విధుజూటు శంకరు విశ్వేశు సభవు
నా చొక్కనాథుని హాలాస్యపతిని
బ్రాచీనపతివంద్యు భక్తితోఁ గాంచి
సాష్టాంగదండముల్ చాలంగఁ జేసి

యిష్టార్థసిద్ధిగా నిచ్చలోఁ గోరి
యంభోజగర్భార్చితాంఘ్రిసరోజ !
శాంభవీరమణ ! విశ్వంభర పాహి
అంధకవ్యాఘ్ర జలంధర త్రిపుర
బంధురాసుర దర్పభంజన ! పాహి
కుంభినీధరచాప కుంభీనసేంద్ర
గంభీర కంధరాగ్రైవేయ ! పాహి
అంహోవిభేదనాహ్వానోగ్ర సప్త
జిహ్వాజిహ్వాగ్ర విచ్ఛేదన ! పాహి
సంహార గజదైత్యసంహార కాల
రంహాజిహ్వాజి నార్ద్రాంబర ! పాహి
అత్రినేత్రజ మిత్రయనిలత్రినేత్ర
నేత్రాగ్ని దర్పకనిద్రాహి పాహి
మాధుర్యపురవాస మకుటవిస్ఫుట క
ళాధరోజ్జ్వల ! సత్కళాధార ! పాహి
అగజామనోహర యధికకైలాస
నగనాథ శ్రీచొక్కనాథ మాంపాహి
యంగయకణ్ణేశ యభవ మాం పాహి
గంగాపగాధర ! కలకంఠ ! పాహి
కామితభక్త శంకర దేవ పాహి
సోమసౌందర్య సంస్తుతనామ ! పాహి
హాలాస్యపురనాథ యట్టాలనాథ
యో లోకరక్షణ యో కృపామూర్తి
శైవదూషకుల నిక్షేత్రమ్ము జేసి
భావించి మమ్మేలు పళియంజినాథ
యని సన్నుతులు జేసి యచ్చోటు వాసి
యనఘాత్ముఁ డాయంగయర్కణ్ణియమ్మ
దరిసించి నుతియించి దండమ్ము వెట్టి
పరమసంతోష సంపన్నుఁ డప్పురిని
వాగీశభక్తి నివాసమ్మునందు
రాగవాసనలచే నుండిరంతటను
నా మంత్రియును వారి నతిభక్తి గాంచి
భూమీశుఁ డాజైనముఖ్యులఁ గూడి

శివదూషకుండౌట సెప్పి వారలకు
వివిధవస్తువు లిచ్చి వేడ్కతో నుండఁ
గడఁగి యామంగయక్కర్షి సౌందర్య
గుడికి నేతెంచు లాగున వచ్చి జ్ఞాన
సమ్మంధుఁ బొడఁగని సర్వస్ము దెలిపి
క్రమ్మఱఁ దనగృహాంగణమున కరిగె
నంతట నాజైను లతనివృత్తాంత
మంతయుఁ దెలిసియు రహస్యపాండీని
కెఱుఁగంగఁ జెప్పి యా యీశ్వరభక్తి
పరుఁడైన బ్రాహ్మణార్భకుఁడు మాతోడఁ
దర్కించి మమ్ము నందఱ గెల్తు ననుచు
మార్కొని వచ్చి యీమధుర నున్నాఁడు
మహిపాల ! యిపుడు మామంత్రాగ్ని వలన
దహియించెదము వానిఁ దప్పక ననిన
నతఁడట్లు చేయుఁడన్నంతట వారు
నతివేగ మంత్రయంత్రాదుల వలన
బడబాగ్ని పుట్టించి పటుశక్తిఁ గదిసి
తడయక నాతని దహియించు మనిన
నదియును బ్రళయకాలానలాకృతిని
గదియ వచ్చిన నంత గరళకంధరుఁడు
దనభక్తవరునకుఁ దగులక యుండ
మనమునఁ గరుణించి మధురేశ్వరుండు
శ్రీచొక్కపతి తన శీతలదృష్టిఁ
జూచినఁ జల్లనై సోఁకెగె నావహ్ని
మఱియును వారలు మధ్యరాత్రమునఁ
బరికించి యతఁడున్న భవనమ్ము మీఁద
ననలమ్ము దరికొల్ప నంతసౌందర్య
ఘనుఁడు దానినిఁ జల్లగాఁ జేసి యనిచె
నంత నామఱునాఁడు నావిధంబెల్లఁ
జింతించి వఱియంజి శ్రీచొక్కవిభుఁడు
కరుణ నాపైఁ జాల కలిగియుండఁగను
బరవాదు లెచ్చట బ్రదికిపోయెదరు
వీరల పనియేమి వీరలే లక్ష్య

నీరీతి వీరల మెచ్చుగాఁ జేసి
కినిసి రాజా రాష్ట్రికృతము పాపమ్ము
ననఁగ నింతటికిని నాలయంబైన
నా పాండ్యపతి మేన నధికమ్ముగాఁగఁ
దాపజ్వరంబేను దగులంగఁ జేతు
నని చొక్కనాథుని నాత్మ భావించి
తన మంత్రబలశక్తిఁ దనర నావహ్ని
క్రమ్మఱ నా రాజు గప్పయించె జ్ఞాన
సమ్మంధుఁ డంత నాశ్చర్యమ్ముగాఁగ
నప్పు డావహ్ని తీవ్రాకార మగుచు
నప్పాండ్యపతి దేహ మాపాదమస్త
కంబును బెన్నిదాఘజ్వరం బతిక్ర
శంబుగాఁ బీడించె నైరణలేక
వైద్యులెవ్వరుఁ జూడ వచ్చువారల క
భేద్యమై యొడలెల్లఁ బచ్చిన యట్ల
మంత్రమ్ములను గాలు మలయుచు నుండు
యంత్రమ్ములకుఁ జాల నగ్గల మ్మగుచు
నౌషధక్రియలకు నధికమై శైవ
దూషులచేత నెందును శాంతిలేక
నప్పు డాపాండీంద్రుఁ డాజైనకులము
రప్పించి మిగుల వారల కిట్టులనియె
నుడుగని తాపజ్వరోష్ణ తాపమ్ము
నొడలెల్ల బడలింపుచున్నది వేగ
మీమంత్రబలశక్తి మెఱసి యీ తాపము
మా మేనఁ దాపమ్ము మాన్పుడీ యనిన
నరయంగ వారలు నట్లకాకనుచు
గుఱుతైన తమ బలికెంచెలఁ దుడిచి
మఱియొన్ని భంగుల మంత్రించి రేని
పరితాపసంజ్వరోపద్రవం బేమి
శమియింప కెల్ల పింఛాంచలంబులును
గమలె నాపాండ్యభూకాంతుని మేన
నంతకంతకుఁ దాప మధికమై గాని
శాంతిగాదయ్యె నాసౌందర్య మహిమ

నంత మంగయకర్త యామంత్రివరుఁడు
చింతించి యావేళఁ జెప్పెద ననుచు
నా పాండ్యపతి వద్ది కల్లనఁ జేరి
యోపతి యుండుల కుపశాంతి సేయఁ
గలవాఁడొకండు నిక్కడ వచ్చినాఁడు
నళగయ చొక్కనాయకభక్తి వరుఁడు
నతఁ డిక్కడికి వచ్చి యధిప ! నీమేను
జేత నంటినఁజాలు శీతలంబగును
దాపజ్వరమ్ము నెంతయు మాని దివ్య
రూపమై యాయురారోగ్యమ్ము లగును
ననినను నృపుఁ డతివ్యాధిపీడనము
దను నొంది యానుశాదన నేర కతనిఁ
బిలిపింపుమన్నను బిరుసునఁ బోయి
చెలఁగుచు నామంత్రిశేఖరుఁ డపుడు
సమ్మంధునికి మ్రొక్కి జనపతికడకు
రమ్ము భూనాథు జ్వరమ్ముఁ బోఁజేసి
నీ మహత్త్వముఁ జూపి నిర్మలచరిత !
యా మాగజిత్కులం బణఁపఁ గావలయు
ననిన నాతఁడు మహాహ్లాదమ్ముతోడ
ఘననీపవనవాసుఁ గరుణావిలాసుఁ
దనమది నిల్పి ప్రార్థన చేసి మ్రొక్కి
చని భూపతిని దనచల్లని దృష్టిఁ
జూచినంతనె కొంత చులుకైనట్లు
లేచి కూర్చుండఁ గల్పించె నారాజు
నంత నాజైనగణాచారు లెల్లఁ
బంతమ్ముతోడ సంబంధునిఁ బాండ్య
జనపతి వామపార్శ్వమునఁ గూర్చుండు
మనుచుఁ బెట్టించిరి యాసనమ్మొకఁడు
దాము నారాజుకు దక్షిణపార్శ్వ
భూమిఁ గూర్చుండిరి బుద్ధి లంతటను
నా పాండ్యభూపాలుఁ డాతనిఁ జూచి
యో పుణ్యచరిత యేయూరు మీఁదనినఁ
దనయూరు దనపేరుఁ దనపాలి శివుని

వినిపించినంతనె విని బౌద్ధులెల్ల
మంగయకర్షను మంత్రినిఁ జూచి
సంగతి వామపార్శ్వ జ్వరోష్ణమ్ము
దనమంత్రబల మహత్త్వంబున నిపుడు
మనుజేశ్వరునకును మానుపు మనుడు
దక్షిణపార్శ్వమ్ము తాపజ్వరమ్ము
తత్క్షణమ్మున మాన్పెదము మేము నవిన
సమ్మంధుఁడును మంత్రి జనకతిమహిషి
సమ్మతించిరి న తె చాలు నటంచుఁ
బంచాస్యుఁ దనమది భావించి చేతి
సంచి విభూతి హస్తమునఁ బట్టినను
జ్ఞానసంబ ధునిఁ గనుగొని యపుడు
జైనులంపఁగను నీ సంచివిభూతి
వలదన్న సంబంధవరుఁడు నాతఁడమె
యిలలోని పాలికి నిష్టమైనట్టి
పరిచారకులఁ జొక్కపతి గుడి కనిపి
తిరువాలవాయిని దీపించు నట్టి
వీభూతిఁ దెప్పించి వెస చేతఁబట్టి
యాభూతనాథుని సభిషేకచొక్క
నాథుని హాలాస్యనాథు నట్టాల
నాథుని సౌందర్యనాథునిఁ దలఁచి
గణుతించి హృదయపుష్కరమున నిలిపి
ప్రణవపంచాక్షరీపరవశ్యుఁ జేసి
ప్రపంచమహాఘోరపాతకాటవి ద
హించు దావానలహేతి విభూతి
యజ్ఞానిజనమానసాంధకారౌఘ
మజ్ఞానఘనపరంజ్యోతి విభూతి
పరమేశహితభక్తిపరుల కైశ్వర్య
కరమగు నధికవిఖ్యాతి విభూతి
యాశాదివర్గరాగాది దోషోగ్ర
రాశి విచ్ఛేదనారాతి విభూతి
ప్రాకటోదగ్రరౌరవఘోరనరక
భీకరోన్నతమహాభీతి విభూతి

దుర్వారఘనశివదూషణోన్మాద
గర్వాచలాశనిఘాతి విభూతి
నయముతో నిహపరానందమ్ము లొసఁగు
ప్రియభక్తులకును సుప్రీతి విభూతి
మానవకోటిజన్మార్జితానవధి
కైనసకంతాగ్రహేతి విభూతి
భూతపిశాచవిస్ఫుటరోగభయద
పాతకమ్ముల నెల్లఁ బాపు విభూతి
మూలమంత్రాధారమునకును నాది
మూలమై విలసిల్లు మూర్తి విభూతి
వేదాగమ పురాణ విద్యలయందు
నాదిమవర్ణనీయమ్ము విభూతి
తనరంగ నేవేళ ధరియించు పుణ్య
ఘనులకుఁ బావనోత్కరము విభూతి
త్రిభువనపావనోత్కీర్తి విభూతి
శుభగుణాలంకృతస్ఫూర్తి విభూతి
పరలోకమోక్షసంప్రాప్తి విభూతి
నరలోకవైభవోన్నతము విభూతి
రణముఖసర్వాంగరక్ష విభూతి
రణబౌద్ధవిజయకారణము విభూతి
సురుచిరాంచితదేహశుద్ధి విభూతి
హరుకృప దీర్ఘాయురారోగ్యములను
సిరు లిచ్చుగాక నాచేతి విభూతి
యనుచు విభూతి మహత్త్వ మీరీతి
గొనియాడి మదిని సంకోచమ్ము మాని
వామనపాండిని వామభాగమున
కా మహాత్ముఁడు తనహస్తమ్ము జాచి
శివరక్ష యని తనచేతి విభూతి
దివిరి పైఁబడవైచి దిగువాఱఁ దుడిచి
నంతఁ దాపజ్వర మడఁగి యాభూమి
కాంతుని సవ్యభాగము శైత్య మయ్యె
మఱియు దక్షిణభాగ మాజైను లెల్ల
వొఱపుగాఁ దమచేత నున్నట్టి పికిలి

కుంచెలు వేయులు గొనుచు మంత్రింప
నించుకైనను శమియింపక యుండ
నాచంద మీక్షించి యతిప మంత్రియును
మీ చేతఁ గాకున్న మీకింకఁ దొలఁగు
డింతమాత్రమ్మున కీయయ్య చేత
శాంతమా నన్న నాజైను లిట్లనిరి
సవ్యపార్శ్వమ్మది చంద్రభాగమ్ము
నవ్యమై యందుండు నమృత మెప్పుడును
దరణి భాగంబిది దక్షిణపార్శ్వ
మరయ నుష్ణాధిక్యమై యుండు కతన
నెడమభాగము శైత్య మెప్పుడు గలదు
కుడిభాగ మితఁడు గ్రక్కున మాన్పనేని
నితఁడె పో దేవుండు నీలోకమునకు
నితనిఁ బోలినవార లెందు లేరనిన
జ్ఞానసంబంధుండు ఘనత నిట్లనియె
నేను నావిషభాగ మిపుడు మాన్చెదను
మీర లమృతభాగమే మాన్పుడనిన
వార లాదిక్కుకు వచ్చిరి యతఁడు
నాపార్శ్వ మటు ముట్టి నంత గాత్రమునఁ
దాపమ్ము మాని శైత్యమ్మయ్యె నొడలు
వీరు వచ్చిన దిక్కు విపరీతముగను
నారని తాపజ్వరానలాఫీల
మధికమై మేనెల్ల నలమఁగఁ బొంద
నధిపతి వారితో ననియె శోకమున
యీభవ్యచరితుండు నేదిక్కు వచ్చి
వీభూతి యిసుమంత వేసినంతటను
జల్లనై దేహమ్ము సౌఖ్యమై యుండె
నెల్లభంగుల మీరలెల్లరు గూడి
యేపంక వచ్చితిరేని నాదిక్కు
పావకజ్వాలల భాతి నయ్యెడిని
ఏటిమంత్రములు మీ రేటిమానిసులు
మాటలేటికిని మీపుంయయలు తెలిసె
వెడలిపొండిట జాలు వేయేల! దేహ

ముడుకుచున్నది మీర లుండితిరేని
ననినను వారు లజ్జాన్వ్యులై వెడలి
చని రందఱును దదాశ్రమముల కంత
నమ్మహీపతి దేహ మవయవాంగములు
సమ్మంధభక్తుఁ డా సవ్యాపసవ్య
భాగజ్వరోష్ణతాపము వేగ పూన్చి
బాగుగా నా గూని పైన విభూతి
హస్తమ్ము వైచిన యంతమాత్రమున
విస్తారవక్షుఁడై విసులికి నెక్కి
కమనీయరూపరేఖాకాంతులందు
నమరేంద్రసుతు లీల నమరినఁ జూచి
నిండినభక్తితో నీవు సౌందర్య
పాండీడవనుచును బలికె నయ్యెడను
నాపాండ్యభూపాలుఁ డతిమోదమునను
నాపుణ్యసతియును నా ప్రధానియును
జ్ఞానసంబంధునిఁ గలుషసంహరుని
యానతి షట్సమయాచార్యదివ్య
పాదస్మలకు జాగి ప్రణమిల్లి నిలిచి
యాదివ్యపురుషుని నర్థితోఁ బొగడి
ధన మపారంబిచ్చి తనరంగ నితని
ఘనభూషణాంబరాకారునిఁ జేసి
పట్టంపుటేనుఁగుపైని మాధుర్య
పట్టణ మ్మంతయుఁ బరగ నేగించి
వీడుపట్లకు మీరు వేంచేయుఁ డనిన
వేడుక సంబంధవిజ్ఞానమూర్తి
హరసమయస్థాపనాచార్యవర్యుఁ
డరవిరి జైనకోలాహలుం డపుడు
సౌందర్యనాథుని సన్నిధి కరిగి
దండదండ సాష్టాంగ ములరంగఁ జేసి
తగు వేడ్క లేచి హస్తమ్ములు మోడ్చి
యగణితశాస్త్రోక్తి నభినుతుల్ చేసి
ఈ దేవుఁ డాగమం బేలినవాఁడు
నే దేవుఁ డపవర్గ మేలినవాఁడు

నేదేవుఁ డాద్యంత మేకమై యుండు
నేదేవదేవుండు నెల్లదేవతల
కాదికినాదియై యాదైనవాఁడు
నేదేవుఁ డకలంకుఁ డేదేవుఁ డచలుఁ
డట్టి సౌందర్యమహాదేవ ! యభవ !
నెట్టనఁ గుబ్జపాండిని జ్వరంబు
నాచేత మాన్పించి నన్ను మన్నించి
శ్రీచొక్కనాథ రక్షించితే ! నన్ను
యని సన్నుతులు చేసి యాదేవుకృపను
దనమతంబున కేఁగెఁ దనవారు పొగడ
సాంఖ్యాదియోగవాసనలచే నతఁడ
సంఖ్యశిష్యులు గొల్వ జయమున నుండె
మునులార యీలీల మునుకొని విన్న
ఘనులకు సకలరోగవ్యథాఘములు
దొలఁగును జొక్కనాథుని కృపగలిగి
కలకాలమెల్ల విఖ్యాతిఁ జెందుదురు
ఇదియు నరువదిలీల యిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార ! వినుఁడి

### అఱువదియొకటవ లీల.

మఱియును బౌద్ధు లామధుర లోపలను
నరపతి వద్ద మున్నవారు గాన
శివభక్తు లప్పురిఁ జేర రాకుండ
శివకథ లారాజు చెవిఁ జొఱకుండ
పాండీని వాఁకిటఁ బ్రబలి యేవేళ
నిండి బోధింపుచుండిరి జైనమతము
నంత నాకుబ్జపాండ్యావనీశ్వరుని
కాంత యాచోళభూకాంతుని తనయ
యామంగయక్కర్షి యమ్మ యేప్రొద్దు
నామహాదేవుపై నతిభక్తి మించి
గురుతరస్వాంగ మంత్రిఁ గులశేఖరార్యు
నరసి రప్పించి యావాఁడఁ దాను నతఁడు
మనమునఁ దలపోసి మఱి జైనకులము
ఘనముగా నెంతయుఁ గడుహెచ్చె ననుచు

జ్ఞానసంబంధులోఁ జాలనిట్లనిరి
జైనులవల్లను శైవమ్ము గొంచె
మై వారి సమయమ్ము నధికమై పొదలె
గావున వారి నొక్కటఁ ద్రుంపకున్న
శైవమ్ము కృశమౌను జైనశాస్త్రమ్ము
లావల ఘనమౌను యది సంశయమ్మె
యనవుడు నది యట్లయౌ నంచు నపుడు
మనమున జ్ఞానసంబంధుఁడు దెలిసి
యిందుకు నా స్వామి యిందుకోటీరుఁ
డెందేని నతనిఁ బ్రార్థింతు నేననుచు
భోరున హాలాస్యపురవాసుఁ డర్ధ
నారీశుఁ డా చొక్కనాయకుండున్న
యావాసమున కేగి యాయష్టమూర్తి
యా వేదవేద్యుని నర్చనల్ చేసి
దండప్రణామమ్ము దనరంగ నిడుచు
నిండిన సద్భక్తి నియతిఁ బ్రార్థించె.
హరహర వేదశాస్త్రార్థతత్త్వజ్ఞ !
యురగేంద్రసద్భూష ! యున్నతవేష !
పాపనాశన జగత్పతి లోకరక్ష
యాపగాధర ! లలాటాక్ష కపాలి !
యలినీలకంధర యధ్యాత్మయోగ
నిలయ విశారద నిజభక్తవరద
మీనకేతనభస్మ ! మేదినియందు
జైనులు హెచ్చి రిచ్చట వారిఁ బట్టి
కొట్టకున్నను నాదు కోపమ్ము పోదు
నిట్టె నన్ను ననుగ్రహింపవే ! దేవ
యని సన్నుతించిన నా మహాదేవుఁ
డనఘాత్మ యది యట్లయౌఁగాక యనుచు
నశరీరభావుఁడై యానతిచ్చినను
బసుపతి యాజ్ఞ చేపట్టి సుజ్ఞాన
సమ్బంధుఁడప్పుడు సంతోష మంది
యమ్మహాదేవుని నభినుతుల్ చేసి
యందండఁ బ్రణమిల్లి యంతట మఱలి

పొందుగా నాకుబ్జభూపాలు కడకుఁ
బరువడిఁ జనుదెంచి భావించి యనిశము
వరుస జైనులతోడ వాదమ్ముఁ జేసి
ఒట్టిగొడ్లను బట్టి యుట్టూతలూఁగఁ
గొట్టు లెక్కింతు నీకును సమ్మతంబె
యనిన నాకుబ్జపాండ్యావనీశ్వరుఁడు
నొనరంగ నట్లసేయుము వేగ మనిన
జ్ఞానసంబంధుఁడుత్సాహియై యున్న
జైను లెన్మిదివేల జనములావేళ
సరవి నాభూపాలు సముఖమ్మునకును
నురవడి నేతెంచి యొనర నందున్న
నుజ్ఞానసంబంధుఁ జూచి యందఱును
బ్రజ్ఞావిహీనులై పల్కి రిట్లనుచు.
మా మంత్రమహిమ మీ మంత్రమ్ము మహిమ
యీ మహీపాలుని యెదుటను దాళ
పత్రాల లిఖియించి ప్రజ్వలవీతి
హోత్ర మధ్యమ్మున నొగి వేయ నట్టి
దహనార్చులందు నిర్దగ్ధమ్ము గాక
సహజమై యున్న నిశ్చలలేఖ పత్ర
మెవ్వారి దట్టివారే గెల్చువారు
నెవ్వరుఁ బచరింప నేల పొమ్మనిన
మదిమెచ్చి జ్ఞానసంబంధుండు నపుడు
నదియట్ల చాలు బౌద్ధాధికులార !
యామాట తిరుగకుండది సమ్మతనిన
నామాట కామాట యట్ల కాకనుచు
విశ్వమంతయుఁ జూడ వేవేగ నపుడు
వైశ్వానరార్చులు వడిమీఱఁ జేసి
భ్రమయక నా కుబ్జపాండిని యెదుటఁ
దమ మంత్రసామర్థ్యతతు లేర్పఱించి
లిఖియించి తెచ్చి యా లేఖలు వహ్ని
శిఖల మధ్యమున వేసిరి సిద్ధముగను
వేసినంతట జైనవితతులు వ్రాసి
వేసిన యాలేఖ వేగంబ యపుడు

తూలమ్ము బందానఁ దోడ్తోన మఱియుఁ
గాలి భస్మంబయ్యెఁ గానరాదయ్యె
జ్ఞానసంబంధుఁ డాసౌందర్యనాథు
మానసమ్మున నిల్పి మఱి వేసినట్టి
యాశైవపత్రిక యావహ్ని యందు
భాసిలుఁ దొల్లిఁటి భావమ్ము కంటె
నంత నాభూపాలుఁ డాప్రజలెల్ల
సంతోషమంది యాశ్చర్యమ్ము నొంద
సురలును మునులును శోభితమ్ముగను
బరగించి రందంద బహుపుష్పవృష్టి
యాజైనులందఱు నపుడు వీక్షించి
యీ జాతవేదుని నిపుడు లోగొంటి
మిది సమ్మతముగాదు నిది యగ్నికట్టు
కొదలేక యిఱుదెఱంగుల వార మిపుడు
పరుస నింకొకలేఖ వ్రాసి యిర్వ్యోటి
వరద వైచినను నెవ్వరిచీటి యేటి
కెదురెక్కు నను వార లిటు గెల్చువార
లిదియ పో నిశ్చయం బిందు కోడినను
వెలిచి యీ యెనిమిదివేల బౌద్ధులము
దరతరమ్మును నీకు దాసులయ్యెదము
సత్యంబె యన్న సుజ్ఞానసంబంధుఁ
డత్యున్నతమ్ముగా ననియె వారలకు
మాకు దాసులమీఁద మఱి యాసలేదు
చేకొని మీకొండు జేయుదు నేగ
మిందు కోడితిరేని నందఱు నాకు
బందాలు గానేల! పరగ నియ్యెడను
నొక్కొక్క కొఱ్ఱు మీ రొగిఁ జేతఁబూని
యెక్కుడాయత్తులై యిచటి కేతెండి
యనిన నాసర్వజ్ఞు లట్లు చేసెదము
ననుచున్న సమయమ్ము నందునఁ గోట
చరుఁడను నొక మంత్రి సమ్మంథవరుని
గనుగొని పల్కెను ఘనతతోఁ గొఱ్ఱు
లెనిమిదివేలు నాయితముగాఁ జేసి

కొనితెచ్చినాఁడఁ బేర్కొని చూడుఁడనుచు
నేనగాఁ దెచ్చి వైచినఁ జూచి యపుడు
జ్ఞానసంబంధుఁ డా జైనుల కనియె
శివకథాలాపముల్ చెవియొగ్గి వినక
భవబంధకర్మముల్ వాయునా ! చెపుఁడ
పంచాక్షరీమంత్ర పఠనమ్ము లేక
పంచపాతకికులు వాయునా ! చెపుఁడ
భక్తుల శ్రీపాదపాంసు మేకొనక
భక్తి ముక్తులు రెండు బొరయునే ! చెపుఁడ
లింగ దేహప్రాణలియ్యమ్ము లేక
వెంగలితన మెల్ల విడుచునే ! చెపుఁడ
జంగమతీర్థప్రసాదమ్ము గొనక
యంగమ్ము పావనంబౌనొకో ! చెపుఁడ
భూతిసర్వాంగసంపూర్ణము గాక
జాతి సంకటములు శమయునే ! చెపుఁడ
రుద్రాక్ష దామభూషలుగాక సకల
భద్రాపవర్గముల్ ఒడతురే ! చెపుఁడ
మదనాంతకుని మీఁద మనసెల్ల నిడక
సదమలానందమ్ము చవియున్నె చెపుఁడ
యటుగాన మీర లియ్యాగ్రహమ్ముడిగి
తటుకున శివభక్తితాత్పర్యు లగుచు
నంచిత భూతిరుద్రాక్షలు దాల్చి
పంచాక్షరీమంత్ర పఠనమ్ము సేయఁ
డెసఁగినదోసమ్ము లెల్లను బాయు
పసులఁ గూలఁగనేల వర చొక్కవిభునిఁ
గొలువుఁ డన్నను జైనకుల మెల్లఁ గినిసి
పలుకులేటికి నింకఁ బదివేలకైన
గెలుతు మీవాదమ్ము కీర్తిగా ననుచుఁ
జెలఁగి యాశూలముల్ చేతులఁ బూని
కొని యప్పుడావైఖ శూలమ్మునకును
జేర నానుజ్ఞాన సంబంధుఁ డట్టి
వారిఁ గన్గొని వచ్చి వారును దారు
నా రీతిఁ బ్రతికలందు వేర్వేఱ

వెలయ నా కూనిమిదివేవురు గూడి
కలియుతై తమమంత్రబలము లేర్పఱచి
లిఖియించి యప్పుడా లేఖలు దెచ్చి
నిఖిలమ్ముఁ జూడఁ బాండీడును జూడఁ
దొడరి యాయుభయవాదములు గూడివచ్చి
వడి మీఱి వారు నావైఖ లోకులను
మునుకొని నడిమధ్యమున వైచి రపుడు
కను ఱెప్ప వేయక కనుగొనుచుండ
నయ్యెడ జైనుల యాకు ప్రాగ్నిశిఖఁ
జయ్యనఁ బోయి యాజలధిలో మునిఁగె
మనమార జ్ఞానసంబంధుఁడు వైచు
దనరు నాశైవమంత్రమైన లేఖ
యాయేటి కెదురెక్కి యటుయాజనమ్ము
పోరాఁ బశ్చిమభాగమునకు నాక్షణము
నప్పు డాపాండీంద్రుఁ డామంత్రివరులు
నత్కృతికెందుఁ బోయను జూడవలయు
సుజ్ఞానసఁబంధుఁ జాపు మం చపుడ
ఖిజ్ఞలతోఁగూడఁ బేర్కొని యతఁడు
వారలఁ దోడ్కొని వరుస నయ్యేటి
రూర నే యప్పుడు యోజనం బరుగ
నాదరి నొకశివాలయము లోపలను
యాదేవుఁ డంత బ్రాహ్మణవృద్ధరూప
మాలీల ధరియించి యటకు విచ్చేసి
యాలేఖఁ దనహస్తమందుఁ గీలించి
జ్ఞానసంబంధుఁ డచ్చటి కేగు వేళఁ
దానందు నిల్పి యాతని చేతికిచ్చె
నావాడఁ బుష్పమ్ము లమరులు గురియఁ
బోరు నదృశ్యుఁడై భూతేశుఁ డంత
నిరవుగా నాపత్రి కిచ్చిన స్థలము
కరమొప్పఁ దిరువడగంబనఁ బరగె
మనమార నపుడు కుమ్మారుగా ననుచు
ననఘులిబాలుఁ డా హరభక్తుఁడైన
జ్ఞానసంబంధుఁ డాజైనులఁ జూచి

మానితహృదయుఁడై మఱియు నిట్లనియెఁ
దొడరుచు నీశ్వరద్రోహమ్ము జేసి
చెడనేల నికనైన సిద్ధమ్ము గాఁగ
హరభక్తలాంఛనంబైన రుద్రాక్ష
ధరియించి భస్మాంగధారులై యుండు
డా మహనీయరుద్రాక్షమహత్త్వ
మామోదమున మీకు నానతిచ్చెదము
శివతత్త్వబోధలు చెవి కింపుగాని
శివనిందపరవాది శిక్ష రుద్రాక్ష
శాశ్వతైశ్వర్య మోక్ష ప్రాప్తమైన
యీశ్వరసేవకాపేక్ష రుద్రాక్ష
భవబంధ దురితముల్ ప్రాపింపకుండఁ
బ్రవిమలసర్వాంగరక్ష రుద్రాక్ష
పరనింద సేయక పరమేశు నాత్మ
స్థిరభక్తి గల్గించు దీక్ష రుద్రాక్ష
దామకమ్ములు గూర్చి ధరియింప నెపుడు
భీమేశ్వరునకు సపేక్ష రుద్రాక్ష
యనవిని యామును లాకుంభసంభ
వునిఁ జూచి రుద్రాక్ష లురుతరమహిమ
దెలుపవే యనుచుఁ బ్రార్థించిన నతఁడు
నలరుచు సౌందర్య నాత్మయం దునిచి
కరమర్థి మునుల కగస్త్యుఁ డిట్లనియె
సరవి తోడుత జ్ఞానసమ్మంధుఁ డపుడు
కరుణించి యా బౌద్ధగణముల కనియె
వినిపింతు రుద్రాక్షవిభవమ్ము మీకు
ననుపమపాతకహరము తన్మహిమ
నరుఁడు భక్తుండైన నతిభక్తుఁడైన
నరయ నీచుండైన నతినీచుఁడైనఁ
దనువున రుద్రాక్ష ధరియించెనేని
బనివడి సర్వపాపవిముక్తుఁ డగును
దతపుణ్యరుద్రాక్షధారణం బెందు
బ్రతిలేని యతిమహావ్రత మంచుఁ దత్త్వ
విదులైన మునులచే వినబడుచుండు

మందమున రుద్రాక్షములు వేయు దాల్చు
నతనికి శివున కెట్లఖిలదేవతలు
నతులు గావింతు రున్నతభక్తి యుక్తి
నొక్కటి వేయును నొదుగకయున్న
నొక్కటి శిఖను బాహులఁ బదారేసి
గరిమ నల్వది మస్తకమునఁ గర్ణముల
నరయ నొండొండైన నాఱేసియైనఁ
జెదరని భక్తి ముంజేతుల రెంటఁ
బదియురెండేసి యేర్పడఁ గంఠమునను
ముప్పదిరెండురంబున నేబదియును
నొప్పు నూఁటెనిమిది యుపవీతముగను
దవిలి యెవ్వఁడుభక్తిఁ దాల్చు రుద్రాక్ష
లవని నాతఁడు పూజ్యుఁ డల శివునట్లు
పగడమ్ములైనను బటికమ్ములైనఁ
దగిన వైడూర్యముక్తామణులైనఁ
గడునొప్పు వెండిబంగరు పూసలైన
నెడనెడ గ్రుచ్చి తా నెపుడు ధరింప
నడర నాతఁడు శివుండగుట నిశ్చయము
యొడలను శివముద్ర యొకటిలేకున్న
బురుషుండు రుద్రాక్షములె ధరించినను
ధరణిఁ బాతకము లాతనిఁ జెందవెఱచు
గరిమఁ జీఁకటి సూర్యుఁ గదియదన్నట్లు
గరుడిని గదియ నాగము లోడినట్లు
రుద్రాక్షమణుల పేరుల జపియించు
భద్రమంత యనంత ఫలముల నించుఁ
జెలఁగి రుద్రాక్షలఁ జేయని జపము
ఫల మల్పమగు మహాఫలము నీలేదు
యొకటైన రుద్రాక్ష యొడల లేకున్న
నకట భస్మ త్రిపుండ్రాంకి గాకున్న
నామనుజాని జన్మమది నిరర్థకము
శ్రీమతి రుద్రాక్ష శిరమునఁ దాల్చి
నరుఁడెవ్వఁడేని స్నానముఁ జేసెనేని
భరితగంగాస్నాన ఫలమందు నతఁడు

జలముక్కటివిడిచి సకలోపచార
ములను రుద్రాక్ష నెప్పుడుఁ బూజసేయు
పురుషుండు శివుఁ బూన్చు పుణ్యాత్ముగాంచు
విరచింపగా నిది వేదవాక్యమ్ము
దలపోయ నేకవక్త్రము పంచవక్త్ర
ములు చతుర్దశవక్త్రములు పదునొకండు
ముఖములు గల్గు నమూల్యరుద్రాక్ష
లఖిల లోకముల కత్యంత పూజ్యములు
నమ్మి శివాత్మకనప్య రుద్రాక్ష
నెమ్మిఁ బూజించిన నేదరిద్రునకు
సదముల ధనధాన్యసంపదల్ గల్గు
నిదిసత్య మిదినిత్య మిది యతిగోప్య
మిది సవిస్తరముగా నెలమిని మీకు
ముద మొప్పఁ జెప్పితి మహాత్ములార !
యట్టి రుద్రాక్షమాహాత్మ్యమ్ము లెన్న
నెట్టన వశమె యానీరజాదులకు
మఱియు నావిభూతి మహిమ లాపాండ్య
ధరణీశ్వరుండు ప్రధానులు మీరు
పూని కంటిరిగదా ! పొగడొందగాను
నానావిధమ్ముల నాబుద్ధి రొంచి
మదిలోన మీ రనుమానమ్ము డించి
సదయులై బ్రాహ్మణార్చన అందు మించి
విభూతి రుద్రాక్ష వెలయ ధరించి
ప్రాభవ పంచాక్షరంబు పఠింపు
డీలాగు వెఱ్ఱులై యేలఁ జచ్చెదరు !
కాలాలఁ గాలంగ సుగతులు గలవె
నెరయ మీచేతఁ బూనిన మాత్రమున నె
బరగంగఁ గొజ్జులఁ బడుట సమాన
మనుచు నాసంబంధుఁ డామాట పలికె
నను జైనులిప్లని రానతి తోడ
మాకును విధినియమం బటులుండె
నా కొజ్జులను గూలుటదిరా మాకనుచుఁ
దుదిని నెవ్వరు శివద్రోహమ్మునకును

బడబడి లోనైన పాపాత్ములకును
నిది ప్రాప్తమని భూమికెల్లఁ దార్కాణ
విదితమై చూపు నావిధమున వార
లాలాగునను మహాహంకారు లగుచు
కూలి యాజ్ఞను దూలి కూఁగాలఁ గూలి
కాలధర్మమునొంది కాలుని పురికి
నాలయంబై బాధ లధికమ్ముగాఁగ
నొందిరి మఱియు నందును శేషమైన
కొందఱు జైను లెక్కుడు శివభక్తిఁ
బూనిన చందానఁ బొసఁగ వారెల్ల
జ్ఞానసంబంధు నాజ్ఞకు భీతులగుచు
దలఁకి రుద్రాక్షలు ధరియించువారు
పాలుపొంద వీభూతి పూసెడివారు
నైనయంగ గోమయం బెందు విభూతి
జనని యంచును మేన సవరించువారు
ప్రాభవం బెడలి యాబౌద్ధులు మఱియు
వీభూతి ఫలియించు వృక్షమ్మలనుచుఁ
దోడనె యాభూతి దొరకక మెడలఁ
గోడెదూడలఁ గట్టుకొని చనువారు
జంగాల మఱుఁగు లిచ్చలఁ జొచ్చి యఱుత
లింగాలు గట్టు కెల్లెడ వచ్చువారు
నాడువారలకు రుద్రాక్షలు లేక
మేడికాయలు గూర్చి మెడఁ జేర్చు వారు
పాషాణములు తలబట్టిలు గట్టి
నౌషధాభిజ్ఞులు నపుడు వేవేగ
నఱ్ఱులఁ జేర్చుక హరహరా యనుచుఁ
గొఱ్ఱులఁ దప్పించుకొని పాఱువారు
సరవి నివ్విధమున సరభసమ్మనను
మఱి శివభక్తుల మఱుగులఁ జొచ్చి
సతతమ్ము జంగమార్చనలందు మించి
బ్రతికిరి మిగుల నాబౌద్ధు లయ్యెడను
నారాజ్య మెల్ల రుద్రాక్షవిభూతి
ధారులై హరభక్తితాత్పర్యులైరి

యాకాలములఁ గూలిశెట్టి యాస్థలము
భాసురమ్ముగఁ గొల్లుబడవీడు నత్యా
నంత నాకుబ్జపాండ్యావనీశ్వరుఁడు
మంతుకెక్కిన యట్టి మంత్రులఁ గూడి
యాశ్చర్యమంది యత్యానందుఁడగుచు
నిశ్చలభక్తుఁడై నిటలాక్షభక్తి
పరుఁడైన జ్ఞానసంబంధునిఁ జూచి
నారయ నీచేత నెన్నిక కెక్కె శైవ
మనఘాత్మ! నీవు పుణ్యాత్ముఁడ వగుదు
వనుచు నాతని మెచ్చి యాక్షణమ్మునను
నా హరుమహిమ రుద్రాక్షవిభూతి
మాహాత్మ్య మధికత మది విన్నకతన
శైవుఁడై జైనతత్సంగతుల్ మాని
వేవేగ రుద్రాక్షవిభూతిఁ దాల్చి
యాస్వామి నప్పుడు నాత్మలో నిలిపి
బ్రహ్మపాండీడు మహాభక్తి మించి
గుట్టుమంగక జైనకులములతోఁ గూడి
నట్టిదోషము వాయు నట్లుగా నపుడు
గావించె వేర్వేఱ ఘనమైన యట్టి
దేవాలయమ్ము లెంతేని వేడుకల
గట్టిగా మఱియు వైఖానది పొంత
పట్టణమొక్కటి సంపత్కరమ్ముగను
గట్టించి శివుకృప గలిగి సామ్రాజ్య
పట్టభద్రుండునై పాలించె మధుర
నీమహాత్మ్యము విన్న నెలమి సజ్జనులు
నామధురేశ్వరు నతిభక్తి గలిగి
యన్యదర్శనముల యాశలు పోని
మాన్యులై సౌభాగ్యమహిమ నొందుదురు
నిదియు నరువదియొండు నిటుమీఁదిచరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
యనుచు సన్మునులతో నాయగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

### ఆఱువదిరెండవ లీల.

అనఘుఁడై పాండీడు నామధురమ్ము
నొనరంగఁ బాలింపుచున్న యత్తఱిని
వార్త చొక్కన సెట్టి వైశ్యవర్తకుఁడు
ఖ్యాతిన వాఁడుత్తమూర్తి సద్వృత్తిఁ
దాపురమ్మున నెప్పు డావాసముగను
గాపురంబుండు వేడ్కలుమీఱ నతఁడు
సౌందర్యునకు ఘనసారసౌరభ్య
చందన మ్మనుదివసమ్ము నర్పించు
నీవిధం బతినిష్ఠ నెప్పొద్దు నెమ్మి
గావించు నొకకొంత కాలమ్మునకును
రయముతోఁ గర్ణాటరాజ్యాధిపుండు
భయ మింతలేక నిర్భరవృత్తి గదలి
బలుభీమ చతురంగబలములతోడ
మహి గ్రక్కటిల వచ్చి మధురపై విడిసె
విడిసిన నాపాండ్యవిభుఁడును గినిసి
నడిచెను దనదు సేనలతోడఁ గూడి
తుదిరించ నా వారు నెదిరి యుద్ధమున
గదనమ్ము జేసిరి ఘనముగా నచట
నపుడు నాపాండీంద్రుఁ డారాజు గోడి
విడినమ్మునకు నేగ విక్రమం బెడలి
యాలాగు నధికుఁడై యాపాండ్యవిభుని
గోలి యారాజును దోడ్తోన మధుర
కరిగి పట్టముగట్టి కారాజ్య మెల్ల
ధరియించి యొకకొంత దానధర్మమ్ము
బాని యావైదికస్ఫూర్తిఁ బోనాడి
తా ను వే జైనశాస్త్రమ్ముల మించె
నప్పు డామూర్తి నెట్టాచొక్కనాథు
నెప్పుడు మదినిల్పి మేలిమిఁ బ్రార్థించు
చుము గంధ మర్పించుచును శైవభక్తి
నమదినమ్మును మించి యాజైనరీతి
నైకొనకుండంగఁ గడఁగి తానెల్ల
ఘానాంతునకుఁ జెప్పి పోసఁగంగ నపుడు

బెగ్గడిల్లిన మది భీతి నొందినను
బిగువు దప్పిన మేను బింకమ్ము సెడిన
మొగము గ్రుక్కినc గాంతమునc బొందియున్న
పరిమళగంధమ్ము పాలి గాకున్న
మరువమ్ము గాదన్న మరుcడొప్పకున్న
పరమేశు శ్రీపాదపద్మమ్ము లాన
తిరముగా నా కిది తిరువాస యనుచుc
గరపాన నపుడు భీకరముగాc బట్టి
యురువడి ముంజేతు లొడ్డి రాచుచును
మునుకొని యా విధంబునc బందనమ్ము
ఘనముగాc దీసియుc గడు మూర్ఛనొంది
పడు నంతలోన నా భక్తవత్సలుcడు
నుడు రాజశేఖరుం డురగాంగదుండు
పరియంతినాథుc డాపత్సహాయుండు
నలరంగc బ్రత్యక్షమై యానతిచ్చెc
జాలు నో హో వీరశైవ! మా కిపుడు
చాలంగ నిటు గంధసారమ్ము వచ్చెc
బూని యాజైనసంబోధనకెల్ల
లోనైన రాజును లోబడిపోవ
గరమొప్ప నొకకొంత కాలమ్మునకును
ధరణి సామ్రాజ్య మంతయు నేలి నీవు
మొనసి యా శివలోకమునకును రమ్ము.
అని యానతిచ్చి యా కాలాస్యనాథుc
డారూఢ విచ్చేసె నంతలోపలను
ఘోరు నామూర్తికిc బొందినయట్టి
వ్రణము లాక్షణమున వట్టింప నపుడు
త్రిణయను నాజ్ఞచేc దేజరిల్లగను
నంత నా సెట్టి తా నాత్మ శోభిల్ల
సంతోషచిత్తుcడై సౌందర్యనాథు
గుడికిని బోయి పేర్కొని స్తోత్రపఠన
మడుగక చేయుచు నున్న యత్తఱిని
నిరవంద బౌద్ధుల కెల్ల లోనైన
నరనాథుcడుండిన నగరు మ్రొక్కులు

తొరసి యారాత్రియందును మంటివాన
గురిసి యాతని గూర్చి ఘోరమ్ముగాను
నప్పుడాతని మంత్రు లాశ్చర్యమంది
యప్పరమేశ్వరు నాజ్ఞగాకనుచుఁ
బట్టమ్ము దొల్లిఁటి పాండ్యభూవిభుని
పట్టి నొక్కని గట్టఁ బాడియౌ ననుచుఁ
బట్టణం బెందును బరికించి చూడఁ
బట్టఁ బేనుఁగుఁ బంప భద్రేభ మపుడు
పట్టణమ్మంతయుఁ బాటించి కాన
కట్టె సౌందర్యనాయకుఁ డుంపు నగరి
కరిగి వైశ్యోత్తముం డందున్న గాంచి
పరువడిఁ బోయి యాభద్రేభ మతని
నురువడి నెత్తి యత్యున్నతమ్ముగను
గరమొప్పఁ దనమస్తకమ్ముపైఁ బెట్టు
కొని పట్టణమ్మునకును బ్రదక్షిణము
ననువందగా వచ్చి యా మంత్రివరుల
ముందరఁ బెట్టిన ముదమంది వార
లందఱు నభిషేక మతనికిఁ జేయ
ఘన కిరీటము దాల్పఁగా వచ్చినంత
మునుకొని చూచి యా మూర్తి యిట్లనియెం.
నీ భద్రజటలుండ నేల మకుటము !
వీభూతి యుండంగ నిడు డభిషేక
మనువైనయట్టి రుద్రాక్ష లుండగను
గనకభూషణములు లగ్గలము మాకేల !
ననుచును సింహాసనాసీనుఁ డగుచుఁ
జని యప్పు డంత నా సౌందర్యనాథు
నగరికిఁబోయి మన్ననగాంచి మూర్తి
జగదీశుఁ డట్టి యా సామ్రాజ్యమెల్లఁ
బూని యావైదికస్ఫూర్తి శోభిల్ల
జైనసందోహ ముత్సార్యమై పోవ
శ్రీ చొక్కనాథునిఁ జిత్తాన నిల్పి
హాచంద్రశేఖర ! హామహాదేవ !
హరహర పన్నగాఢ్యక కేయూర

C.C.—24

కఱకంఠ నన్నిట్లు గాచితే యనుచు
శ్రీకంఠుఁ దలఁచి యాశివు గుడి వెడలి
ప్రాకటేంద్రియ నిగ్రహముగాఁగ ననఘుఁడు
రాజస్థాన మధురాపురం బెల్ల
రాజితస్ఫుగ మూర్తినాయశిఖుఁడు
కామించి యొక కొంత కాలమ్మునకును
నా మహాదేవుని నాత్మలో నిల్పి
పరగంగఁ దొల్లింటి పాండ్యభూవిభుని
వెరవుతోఁ బిలిపించి విభుని గావించి
యరయ వైశ్యోత్తముం డామూర్తి సెట్టి
కరిమెప్ప నేగెను కైలాసమునకు
నిదియు నఱువదిరెండు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడీ
యనుచు సన్మునులతో నా యగస్త్యుండు
మనమునఁ దలపోసి మఱియు నిట్లనియె.

## అఱువదిమూఁడవ లీల.

మఱియును నాపాండ్య మండలేశ్వరుఁడు
దురితదూరుఁడు జైనధూర్తుల నెల్లఁ
గ్రుంగించి మూర్తిభక్తుఁడు శివలోక
సంగతుండైన యాసమయమ్మునందుఁ
దప్పక యాపాండ్యధాత్రీతలంబు
నెప్పటి యట్లనె యేలుచునుండ
నత్తఱిఁ గార్యారి నార్యారు లనఁగ
నుత్తరదేశాన నుండి యాయిరువు
రాపాండ్యవిభునకు నధికకావ్యములు
నేపార రచియించి కలిమి నేతేరఁ
గాంతారమునను మార్గము దప్పివారు
భ్రాంతి విభ్రాంతులై భ్రమసి వర్తింప
నత్తఱి మధురేశుఁ డాచొక్కవిభుఁడు
చిత్తజదమనుఁ డాశ్రితవత్సలుండు
సితకరార్ధధరుండు శ్రీమహాదేవుఁ
డతికృపారసపూర్ణుఁడా దీనాథుండు
పశుపతి యప్పుడా ప్రాంతమ్ము నందుఁ

బఱువులఁ గాఁచు గోపాలుఁడైఁ పసులఁ
గోరి మేపుచుఁ బిల్లఁగ్రోవిఁ బట్టుచును
నీరీతి గొల్లఁడై యిట్లున్నవారు
నాదమ్ము వించు నా నాదస్వరూపు
నాదలోలుని జగన్నాథునిఁ జేరి
యోగొల్ల! వీక మాకొనరంగఁ బాండ్య
భూవిభుఁ గానంగఁ బోవలె మధుర
పురికి మార్గంబేది పొందుగా నిపుడె
యరసి చెప్పుము మాకు నతివేడ్కతోడ
ననిన సర్వేశ్వరుఁడందుఁ బోవుటకుఁ
బనియేమి మాకుఁ జెప్పఁగవలె ననిన
నా కవీశ్వరు లప్పు డందుకు నీకుఁ
జేకొని పోవుట చెప్పెడి దేమి
త్రోవ యేదన్న నా ధూర్జటి మతి యా
నీ విధంబెల్ల నా కెఱిఁగింపకున్న
నేను జూపను త్రోవ నిక్కమ్ముగాను
మీ నేర్చు విధమున మీరేగు డిపుడు
ననుచు మందస్మితుండైన నా స్వామి
గనుగొని మూఢుఁషం గాఁడని వారు
నెలమితో మనము పోయెడి పనిఁ జెప్ప
వలయు లేకున్నఁ ద్రోవయుఁ జెప్పఁ డితఁడు
ననుచు నా కవియుగ్మ మతని కిట్లనిరి
అనఘ! విద్వాంసుల మటు పాండ్యవిభుని
పాలికి మా గద్యపద్యమ్ములెల్లఁ
బోలంగఁ జదువను బోయెద మనిన
మధురలోపల మహామహులు విద్వాంసు
లధికులు గలరు మహాకావ్యపరులు
పెద్దగా మీఁటఁ బేర్కొన్నయట్టి
గద్దెపద్దెమ్ములు గడఁగి మా యొద్దఁ
జదువుఁడన్నను వారు సంభ్రమంబునను
జదివిరి వేర్వేఱఁ జతురత్వముగను
నయ్యెడ గోపాలుఁడైన యాస్వామి
చయ్యనఁ దనతోడఁ జఱచి నవ్వుచును

నా కవీశ్వరులతో నప్పుడిట్లనిరి
నీకావ్యమే మీర తెలిమితోఁ బాండ్య
జననాథు పాలను జదువఁ బోయెదరు
వినుఁడు నాచొక్క కవిత్వమ్ము మీరు
జతనమ్ముగా నంచుఁ జదివిన నపుడు
నతివిస్మయంబంది యా కవులనిరి
యితఁడు గొల్లఁడు కాడ యొన్నని విధుల
నితఁ డీశ్వరాంశంబ యిదిసార్థ మనుచు
నాదేవుఁ జూచి వారతి వేడ్క తోడ
సాదరచిత్తులై సరవి నిట్లనిరి
యీ కవిత్వము తెల్ల నైలమి నాపాండ్య
భూకాంతు చేరుపఁ బోయి మరిగప
నతఁడు మాకిచ్చిన యాధనంబెల్ల
వితతమ్ముగా నీకు వేడ్క నిచ్చెదము
త్రోవేది సెప్పు ప్రొద్దున మాకు నిపుడు
పోవలె మధురకు భోరున ననుచుఁ
దనర నీవింత సౌందర్యమానుఁడవు
ననఘాత్మ! నీవెవ్వరంచు వారడుగ
నప్పు డాకార్యారినార్యులకును
దప్ప కిట్లనిరి సౌందర్యనాయకుఁడు
గోపాలకుఁడ చొక్కఁ గోనేరి పేరు
నీపట్టణమ్మున నేను వర్తింతు
పనులకాపరు లేడ! బసదనం బేల!
పసలేదు నాకొద్దు పదివేలు నైన
మీకావ్యమున నర్థమిపుడు భాగించి
చేకొని నామీఁదఁ జెప్పితి రేని
తెరువిత్తు లేక యేతెరువును జూడ
నిరవందగా నన్న నైలమిని వారు
మార్గమ్ము జూపు సమ్మతి నిత్తుమనిన
మార్గమ్ము జూపి యా మార్గసహాయుఁ
డంత నదృశ్యుఁడై యరిగె నాస్వామి
యింతేని విస్మయం బెసఁగ నా కవులు
శ్రీచొక్కవిభుఁ డని చిత్తానఁ దెలిసి

యచ్చోట నుండక యతి సంభ్రమమున
నేతెంచి మధురకు నీశు సర్వేశు
జ్యోతిర్మయాకారు నురగకేయూరు
నాదేవు గుడికేగి యధికసద్భక్తి
నాదేవదేవుని నర్చనల్ చేసి
ధరరథారూఢ! భూధర పరిష్కార
ధర ధరాస్త్రీకృత ధరసుతాత్మేశ!
ధరచాపధర! జలంధరదైత్యహరణ
ధరకూటనగర కంధరజటాకార ?
వదలక సర్వదైవతసమూహముల
మొదలనే గోబృందములఁ జేసి కాచి
పశుపతిత్వమ్ము నీపాలను కగ్గె
పశుపతి! లోకేశ! పరమప్రకాశ
రామధురాధ్యక్ష! రాజప్ప మీకరుణ
మామీఁద నిల్పితే మార్గసహాయ!
యని సన్నుతుల్ జేసి యపుడు వేర్వేఱ
ఘనతర సర్వలక్షణయుక్తమైన
తాము సెప్పిన కవిత్వమ్ములో సగము
నా మహాదేవున కర్పించి మఱియు
వలసిన సంస్తుతుల్ పలుమఱుగాఁ జెప్పి
యలవడ నాకావ్య మర్పణఁజేసి
సరవితో నాస్వామి సత్కృపగాంచి
మఱియు నాపాండ్య భూమండలు కడకు
నరిగి యాసగమును నతనికిఁ జదువ
మఱిమెచ్చి యారాజు మన్నించి యిచ్చు
ఘనతరవస్తువుల్ గడువేడ్కఁగొంచు
ననఘు లాకార్యారి నార్యారులపుడు
పొగడొందఁ దమ దేశమునకును బోయి
యగణితమ్ముగ నుండి రాస్వామి కృపను
నిధియా నరుపదిమాఁడు నిటమీఁది చరిత
ముదముతోఁ జెప్పెద మునులార వినుఁడి
వారాశి చేపట్టి వార్చిన తపసి
మారారి చరితమ్ము మఱిచెప్పదొడఁగె

## అఱువదినాల్గవ లీల.

నాపాండ్య భూపాలుఁ డధిక ప్రతాప
దీపుఁడై యా పాండ్యదేశ మేలంగ
నట్టి కాలమ్మున నచట మాధుర్య
పట్టణమ్మున నొక బలుసెట్టి గలఁడు
నతివ వివాహమై యతిభక్తి గలిగి
సతతమ్ము జంగమార్చన చేసికొనుచు
మధురాధిపతి సేవ మదిని నేమఱక
నధికుఁడై బ్రతుకుచు నట్లుండునంత
నాతని మాతులుం డతి ధర్మపరుఁడు
నీతివర్తనముల నెరయంగఁ గల్గి
యుత్తర భూమిలో నొకపురమ్మునను
నుత్తమ శ్లోకుఁ డత్యున్నతైశ్వర్య
సంపన్నుఁడై తన సాధ్వికిఁ బుత్ర
సంపద లేకున్న సతతమ్ము జంగ
మార్చన సేయుచు నభవుని నెపుడు
నర్చింపుచుండంగ హరుకృపవలన
వరగుణ రూపలావణ్యమ్ములకును
గుఱిసేయఁదగు నొక కూఁతురుఁ గనియె
నాపిన్నపాప యత్యంత మోహన క
లాపయై పెరిగె నల్లారుముద్దుగను
నాకన్నె యౌవన ప్రాప్తయైనంతఁ
జేకొని యా బాల శృంగారమెన్న
నాకురు లానెఱి లాగొప్ప కొప్పు
నాకన్ను లాచన్ను లాయారు తీరు
నామోవు నాగోము నాదంతపంక్తి
నా ముక్కు నా చెక్కు లా చక్కదనము
నా బావు లా మోహనాధరోష్ఠమ్ము
నా బాగు లాలాగు లాకాను మేను
లాచేతు లారీతు లా కాళ్ళు వ్రేళ్ళు
లా చూపు లారూపు లాచంకపొంక
మా తొడ లానడ లా మెడ కడుపు
నా తేట లామాట లా సొంపు పెంపు

నా శోభ యా నాభి యా తిన్నదనము
లా శీల మాగుణ మా యౌవనంబు
మరునకునైనను మరులు పుట్టించు
సరసమోహనలీలఁ జాల నాబాల
నవ్వనితామణి నచటి బంధువులు
నెవ్వడువడిగిన నీక యాతండ్రి
తన మేనయల్లునిఁ దగువేడ్కఁ బిలువఁ
బనిచెను మాధుర్య పట్టణమ్మునకు
వెలయ నా యల్లుండు వేడ్కతోడుతను
బిలువంగఁ బోయిన పెద్ద మన్నించి
తన యగ్రభార్యను దనయుల నందె
యునిచి బందుగులకు నొగి నప్పగించి
తడయక సోమ సౌందర్య నాయకుని
గుడికిని జని మది కోరిక లెసఁగ
నళగయ చొక్క ! మోహనాస్యనిలయ !
మళియంజినాయక ! పార్వతీరమణ !
వ్యాఘ్ర చర్మాంబర ! హరహర ! నాయ
శీఘ్రంబె యిష్టార్థ సిద్ధిగాఁ జేయు
మనుచుఁ బ్రార్థనచేసి యందంద మ్రొక్కి-
ఘనమతి సంగయ కన్యమ్మ గొల్చి
యానెట్టి పరిణయంబాడ నుదీచ్య
దేశమ్మునకును నెంతే వేడ్కతోడఁ
దనబందుగులను గొందఱఁ గూడికొనుచుఁ
జనిరా సంబళములు సాలంగఁ గొనుచు
నరుగుచోనంతట నత్తమామలును
జ్వరపీడనమ్మున స్వర్గస్థులగుచు
నెల్లరతోడ నాయింతి నా మేన
యల్లుని కిమ్మని యర్పించి చనిరి
యఁట బైనగతులచే నతని మేనల్లుఁ
డటకును బోయిన నతని బందుగులు
కని యంద ఱాతనిఁ గౌఁగిటఁ జేర్చి
తన యత్తమామ వృత్తాంతముల్ సెప్పి
యీ కన్య నెవ్వరి కీక మాతోడ

నీకు నిమ్మని చెప్పి నీ మామ చనిరి
ననివార లాలాల నా ధనరాసు
లును బహుధాన్యంబులును నొప్పగించి
ప్రేమతో నిచటనే పెండ్లియాడెదవా !
యా మధురాపురి కరిగెదో ! యనిన
మధురకుఁ దోడ్కొని మావారు చూడ
నధికమ్ముగాఁ బెండ్లియాడెద ననినఁ
బొమ్మని వారలు ప్రోదితో ననుప
నమ్మగువను సకలార్థముల్ గొంచు
వచ్చుచోఁ ద్రోవ నావనిత రాలేక
నొచ్చి రాఁ దనదు బందుగులను బిల్చి
నడువ లేదీ బాల నలుగకయుండ
దోడుకొనివచ్చెదఁ ద్రోవ నొయ్యనను
నందఱు మీర లీయర్థమ్ము గొంచు
బొందుగా మాధుర్య పురమున కరిగి
యతులితమ్ముగ వివాహ ద్రవ్యములను
నతివేడ్కఁ బెండ్లికి నాయత్తపఱచు
డని వారలను బంపి యల్లనల్లను
వనితను దోడ్కొని వచ్చుచోఁ ద్రోవ
తిరుపెరుంబను. నూరి జేవరఁ జేరి
దరిసింప వారలిద్దఱు నటువచ్చి
యాయూరి సర్వేశు నంబికాధీశు
సేవించి యచట వసించి రారాత్రి
యా సెట్టి యా శివాలయ మంటపమున
నా శీవిషాదష్టుఁడయ్యె నయ్యెడను
నింతి యాపరపుల నేడ్చుచునుండ
నంత ప్రొద్దునను మంత్రౌషధ క్రియల
జాంగలికులు వచ్చి యయ్యన నెన్ని
భంగుల మంత్రించి పరిహరించినను
నావేళ మఱలక యా సెట్టి యచట
దైవికమ్మునఁ గాలధర్మమ్ము నందె
నప్పుడు వైశ్య కన్యామణి యచట
నప్పరమేశ్వరు నాశశాంకార్ధ

జూటు సన్నిధికి నేడ్చుచుఁ బోయి మ్రొక్కి
నిలిచి తల్లియును దండ్రియును దోఁబుట్టు
గులు లేక యున్న నాకును మేనబావ
నను దోడుకొని చొక్కనాథుని పట్న
మునకుఁ బోవుచుఁ ద మిత్త్రులను దర్శించి
యుండ నండ నహిదష్టుఁ డీ సెట్టి మృతిని
బొందుట యిది మహాద్భుతము సర్వేశ !
ఈ దేవ ! యఁటలను నొంటి నేనైతి
నాదిక్కు దెసఁ జూచి నాపాటుఁ జూచి
రతితోఁ బతిభిక్ష రతిదేవి వేడ
నతనుని బ్రతికించి యనిపిన యట్లు
శతరూప పురుషభిక్షము పెట్టుమనిన
బ్రతికించి దక్షునిఁ బాలించినట్లు
పరమేశ ! యీ సెట్టి బ్రతికించి నాకు
పురుషభిక్షము పెట్టి ప్రోవకయున్నఁ
బ్రిణయన ' నీ సన్నిధికి తృణమ్మునను
దృణముగాఁ బ్రాణముల్ తెగువతో విడిచి
దేహమ్ముఁ బలన సందేహమ్ము లేక
నాటలుతానె నరు నాటుతు లిత్తు
ననుచు దుఃఖింపుచు నబల గోచ్చునను
మానముఁ దెగియుండె మఱియు సంతటను
నాదయాపరమూర్తి యార్తరక్షకుండు
నా దేవదేవుండు నభయదాయకుండు
జ్ఞానసంబంధు నాత్మజు నామె రావించి
పూని యా సెట్టి కిప్పుడు విషహరణ
ముగఁ జేసి బ్రతికించి పొందమ్ముతోడ
మగువఁ బెండిలి చేసి మఱిపిరిఁ బనుపు
మని యానతిచ్చిన నతఁడును వచ్చి
తన దివ్యదృష్టి యాతనిమీఁద నిడిన
యంతట బ్రతికె వయ్యన లేచి వచ్చి
సంతోష మెసఁగ నాసతియును బతియు
నిరువురు తిరుమెరుంబేశు సన్నిధికి
నరిగి సాష్టాంగమ్ము లందందఁ జేసి

దేవ ! సర్వేశ్వర ! దేవాదిదేవ !
భావజసంహార ! పాపవిదూర !
తిరుపెరుంబాపురాధీశ ! లోకేశ
తరుణేందుజూట యీ తరుణిని నన్ను
బ్రతికించితివి కృపాపారీణ హృదయ !
మతి గొల్చి నేను నా మధురకుఁ బోయి
యీ యింతిఁ బెండ్లాడి యిల్లకాలమ్ము
కాయజాంతక ! నీదు కరుణ నుండెదము
పోయెదమని వేగఁ బొలఁతియు నతఁడు
నా యీశునకు పంచనార్థులై జ్ఞాన
సమ్మంధునకు మ్రొక్కి చనియెద మనిన
నమ్మహాత్ముఁడు వారి కానతి యిచ్చె
నరయఁ బ్రాణములు దేహమ్ము లనిత్యములు
తిరుపెరేశ్వరు సన్నిధిని వేడ్కతోడ
వైళంబ యిచట వివాహమై మీరు
హాలాస్యపురమున కరుగుడీ ! యనిన
సెట్టియుండులను నిషేధింతు రచటి
చుట్టమ్ము లిదియేవాడఁ జాలు నా గాన
నరిగి యచటను బెండ్లాడెద మనిన
సుతియును జ్ఞానసంబంధుఁ డిట్లనియె
నందు కేజమ్మియు హరుఁడు కూపమ్ము
పొందుగా సాక్షి సెప్పుదు రింపు వైన
వెరవక పెండ్లాడు వేడ్క నీవనిన
పరిణయంబాడె నాపడఁతిని సెట్టి
యాదంపతులు వచ్చి యతిమోదమునను
నా దేవునకును సాష్టాంగముంజేసి
సమ్మంధవరునకు సద్భక్తిమ్రొక్కి
మమ్ము రక్షించితి మరువ మెన్నఁడును
బోయెదమని చెప్పి పొలతియుఁ దాను
బాయక మాధుర్య పట్టణమ్మునకును
నేతెంచి తనవారికెల్లఁ దాఁ బన్న
గాతురుండగుటయు నా స్వామి కరుణ
బ్రదికి యాయింతినిఁ బరిణయంబగుట

విదితమ్ముగా జెల్లి వివరించి మఱియు
నతివయు మున్నెందు నతివయు నతఁడు
నతివేడ్క నుండిరి శాలాస్య కృశను
నప్పుడాయింతి తా నాత్మేశు మీఁదఁ
దప్పక యత్యంత తాత్పర్య మెసఁగ
ఘనమైన పతిభక్తి గలిగి వర్తించె
ననఘాత్ములార! సంయములార! మీకుఁ
గరతలామలకమ్ముగా వినుపింతు
సరవిఁ బతివ్రతాచార మెట్లనిన
మఱి భర్త తన్ను రమ్మన వేగ వచ్చి
గరిమఁ జెప్పిన యాడిగము సేయవలయు
నాత్మేశుఁ డానతీయక యేమియైన
నాత్మబంధులకు నీయఁగరాదు సతికి
జీవితేశ్వరుఁడు డించిన యోగిరమ్ము
కేవలం బది యారగింపగ వలయు
మగఁ డారగించిన మఱి భుజియింపఁ
దగు నిద్రవోకుండఁ దగదును నిద్ర
తటుకున నాథు నిద్రయు లేవరాదు
నట యనుష్ఠానసంధ్యావేళ గాని
కూడ గల్గ నొంటిమై నేగంగరాదు
కడపపై మఱి ఱాయి గద్దెపై సన్ని
కంటిపైఁ గూర్చుండగారాదు నెపుడు
వంటుగట్టక నీళ్ల నాడంగరాదు
పసపు గుంకుమయుఁ గూర్పాసమ్ము కబరి
కుసుమంబు చెవులయాకులు కాళికయును
తర మంగళాలంకృతంబులు దినము
ధరియింప నెప్పుడు ధవుఁడు వర్ధిల్లు
విధవతోఁ దక్కిన వేశ్యతోడుతను
నధికనుతాపాని వ్యభిచారితోడ
మడివాలుదానితో మగనితోఁ బోరు
చేడెతోఁ బరిచర్య సేయుంగరాదు
దూరస్థుఁడన్న నాథుని కెదురెదురు
గోరుచు నుండంగఁ గొన్నాళ్ల కెదురు

వచ్చిన భర్తకు వడిఁ బాదయుగళ
మచ్చుగాఁ గడిగి యాహారమ్ము వెట్టి
యుల్లమ్ము రంజిల్ల నొగి విడె మిచ్చి
చల్లగా మృదువైన శయ్యాతలమ్ము
నత్తఱి నూరుల యందంద యొత్తి
చిత్తమ్ము రంజిల్లఁ జేయంగవలయు
నీ గుణమ్ములు గల యిల్లాలిఁ జూచి
బాగైన ఘనపుణ్యభామిని యండ్రు
వేయేల నిట్టి సాధ్విని నెవ్వఁడేని
పాయని వేడ్క నవాంగమ్మునందుఁ
బలుమారు నాత్మలోపలఁ దప్పఁజూచు
నల ద్రోహియైన దురాత్ముని కెపుడు
బడబానలము కంటె పావకు కంటె
సతత పతివ్రతాచార ప్రభావ
మతితీవ్రమై తాఁకు నా సాధ్వి చూపు
పాలిండ్లపైనున్న పయ్యెద మీఁద
గాలిపాటుగ నోఁడు కడు జేతులెత్తు
నని పతివ్రత లక్షణమ్ములు గొంత
వినిపించి వినుఁడు నా వెలఁదిట్లు నడువ
నట గొంతకాలమ్ము నత నన్యభార్య
చిడిముడి పడి యుదాసీనమ్ము లాడి
యోసి ! నీవెక్కడనో గూడి వచ్చు
దాసివి నాసరి దానవా ! యనిన
యానాతి లజ్జానతాస్యయై యేను
గూడివచ్చుటయును గుఱుతుగాఁ బెండ్లి
యాడివచ్చుటయును నాస్వామి యెఱుఁగు
తిరుపెరుంబాపురి దేవుండు జమ్మి
తరువు కూపమ్మును దగు సాక్షి గాక
యచ్చోట నేపెండ్లియాడి యిచ్చటికి
వచ్చితి నన్న యావనిత యిట్లనియె
నీవు చెప్పిన వారి నిచటికి సాక్షి
రావించినను బతివ్రత వౌదు. నీవు
పనిన నాచొక్కనాయకుని సన్నిధికిఁ.

జని తలోదరి నమస్కారమ్ము జేసి
యోసోమసౌందర్య ! యోకృపాధుర్య !
యో సదాసంజ్ఞాత్మ ! యోపరమాత్మ
యో మీనజాత్మేశ ! యోదుఃఖనాశ
యోకామభస్మాంగ ! యోకృపాపాంగ !
యోకాలసంహార ! యోకృపాకార !
యోమధురానాథ యోచొక్కనాథ
నాపాలిదైవంబ ! నాపాలి వేల్ప !
నాపాలి సర్వేశ ! నాపాలి వరద !
పరమేశ నామశోభావమున తిరు
పరమేశుఁడు శమి కూపంబును సాక్షి
గాను బెండ్లాడి యిక్కడికి వచ్చినను
నేను టాటోటని నేఁడు నా సవతి
కన్నిచ్చవచ్చినకన్నె నీ వనుచు
నన్ను బోనాడె బాంధవు లెల్ల వినఁగ
దేవ ! నాకెవ్వరు దిక్కులేరాత్మ
భావింప నీవె నాపాలిదైవంబు
దాతయుఁ దల్లియుఁ దండ్రి వీవనుచు
నాతురమ్మున వస్తి సభవ యా జమ్మి
వృక్షమ్ము కూపమ్ము వేగ నిచ్చటికి
సాక్షి రప్పించి యీజగ మెల్ల నెఱుఁగఁ
బెండ్లాడు విధము చెప్పింపక యున్న
గుండ్లతోఁ దలకొట్టుకొని చచ్చుదాన
తలపు లేటికి నింకఁ దప్ప నీమాట
పలియయంజినాథ ! నీపాదమ్ము లాన
యని విన్నవించిన హాలాస్యవిభుఁడు
మనమున దయగల్గి మగువ యింటికినిఁ
బొమ్ము ముందరను నిప్పుడు మేము నుయ్యి
జమ్మి యచ్చట వచ్చి సాక్షి చెప్పెదము
నని నను బ్రణమిల్లి యామాట నమ్మి
తనజాతి గూర్చి యత్తన్వియు నంతఁ
గావేరి దరినున్న ఘనశమి నుయ్యి
యావైఖ దరి మధురాపురమ్మునకు

స్థావరమ్ములు మాని జంగమరూపు
లై వచ్చియొల్లరు నాశ్చర్యమందఁ
గాండీడు దుర్గాధిపతులు మన్నీలు
దండనాయకులు నందఱు వినుచుండ
వినువీధి సురలెల్ల వెఱఁగంది చూడ
వినిపించె నప్పుడా వృత్తరూపములు
తిరుపెరుంబాపురి దేవదేవునిని
దరిసించి వేడ్క నీతరుణి సెట్టియును
యా రాత్రి వసియింప నావేళ సెట్టి
దారుణాశీవిషదష్టుఁడై యచట
మృతిపొంది నంత నీ మీనాక్షి దైవ
పతి సన్నిధిని దుఃఖపడి వినుతింప
నమ్మహేశ్వరుఁడు దయాళుఁడై జ్ఞాన
సమ్మంథు మంత్రరక్షను బ్రతికించి
యట వైశ్యసతికి మేముందఱుఁ జూడ
నిటలాక్షుఁ డపుడు పెండిలి సేసి యనిరె
నిందుకు సందేహ మేదియు లేదు
సౌందర్యనాథుఁడే సాక్షియౌ ననఁగ
నామధురేశ్వరుం డభవుఁ డవ్యయుఁడు
సోమశేఖరమూర్తి సురరాజనుతుఁడు
విభుఁడు మీనాక్షితో వృషభమ్ము నెక్కి
సహితులై యా దేవసంఘముల్ గొల్వ
మిన్నేరుజడలును మిక్కిలికన్ను
బున్నమరాయనిఁ బువ్వుగాఁ దాల్చి
పొడల దుప్పటి గట్టి భూతి మేనమర
నొడల రుద్రాక్షలు నొరవుగా మెఱయఁ
గప్పుగుత్తుక యొందుఁ గాంతి చెన్నొంద
నుప్పరమ్మున సుర లుప్పొంగి చూడ
వైశ్యకన్యామణి వైఖరు లెల్ల
వైశ్యకోటికి రాజవరులకుఁ దెల్ప
నాశ్రితజనుల నిట్లాడికొండనుచు
నాశ్రిత వాత్సల్యుఁ డభయదాయకుఁడు
పతియంజనాథుఁ డావత్సహాయుండు

నఖిలలోచనుఁడైన హాలాస్యవిభుఁడు
శ్రీచొక్కనాథుండు శితమన్మథుండు
వాచామగోచరవర్ణితయశుఁడు
నడబావి జమ్మికి నడుమగా వచ్చి
పొడవున నిలిచెఁ జెంపున గానిపించ
నప్పుడచ్చటి జను లామహీవిభుఁడు
నప్పత్మలోచన యా వైశ్యవిభుఁడు
నత్యంతభక్తి సాష్టాంగమ్ము నెఱఁగి
సత్యంబు దెలుపంగ స్వామి విచ్చేసె
ననుచుండ నంతలో నద్రిజాజాని
వినువీధిఁ బ్రత్యక్షవిభవమ్ము మెఱసి
యచ్చట నున్నట్టి యందఱు వినఁగఁ
జెచ్చెరఁ దానిట్లు చెప్పంగఁ దొడఁగె
నౌనరంగ నాలింపుఁడో వైశ్యులార !
యొనరంగ నాలింపుఁ డో జనులార !
యీవైశ్యసతికిని నీకళావతికి
నీవారిజాక్షికి నీగుణవతికి
నీముగ్ధకీసాధ్వి కీసతీమణికి
నీమందగమనకు నీపతివ్రతకు
నౌచిత్యముగలదన్న నొందు దోషములు
నౌచిత్యము లేదన్న నొందుఁ బుణ్యములు
బావియు జమ్మియుఁ బలికినవిధము
భావింప నిజముగాఁ బరికింపకున్న
రౌరవనరకమ్ము రాకేల మాను
నారయ నిది నిజంబని పల్కి శివుఁడు
నావేళ సతిపతులాత్మ నుప్పొంగి
వేవేగ సౌందర్యవిభునిగా నెఱిఁగి
దండముల్ భక్తి నెంతయు నాచరించి
చండాంశునేత్రాయ సర్వేశ్వరాయ
కాలకూటధరాయ గంగాధరాయ
హాలాస్యనాథాయ యఘనాశనాయ
పరమపవిత్రాయ ఫాలనేత్రాయ
కరుణార్ద్రచిత్తాయ కాలకాలాయ

దుర్గాధినాథాయ దురితహరాయ
భర్గాయ తే నమో పార్వతీశాయ
కైలాసనాథాయ కాలకంఠాయ
లీలావిలాసాయ లేఖస్తుతాయ
పాహి జ్యోతిర్మయ ! భవ భయహరణ !
పాహి శంకర శివ పావనాకార
యపవాద మెడలించి యభవ యీవేళ
కృపగల్గి ప్రోచితే కృత్తివాస !
యని యిట్లు ప్రార్థింప నారఁ డట్టివేళ
జను లందఱాలింప జగము కీర్తింప
నీమహాస్థలియందు నెంచి చూడంగ
కామాక్షికనఁ బతివ్రతలు లేరనిరి
నప్పుడు సభవార లందఱు రాజు
నప్పుణ్యసాధ్వికి నందంద మ్రొక్కి
యిట్టిపుణ్యాంగన నెఱుఁగ మెందులను
సెట్టి యెంతటి పుణ్యశీలుఁడో ! యనుచు
జనపతి ప్రజలును జగము వారెల్లఁ
గొనియాడి రటు నొక్కఘోషమ్ముగాను
సురలు సంతోషించి సుమసారవృష్టి
గురియించి రప్పుడు చొక్కులు నెలఁగ
మానుగా నాజమ్మి మాను కాపమ్ము
మాన నప్పుడు నుండు మధురాపురమున
నాసాధ్వి యాసెట్టి యతిభక్తి గలిగి
శ్రీసౌందరేశ్వరు సేవఁ జేయుచును
బేరసారము లాడి ప్రేమతో జంగ
మారాధనము సేయు చట్లుండి రంత
నావేళ సకలలోకావనోదారు
భావజసంహారు భక్తమందారు
శ్రీచొక్కనాథుని క్షితిమండలమునఁ
బ్రాచుర్యమహిమతోఁ బట్టమ్ముగట్టి
భావించి సురలతోఁ బద్మలోచనుఁడు
నావిరించియును నింద్రాదిమునులు
దీవించి మధురేశ ! యోచొక్కనాథ !

రాజశేఖర ! నీవు రాజితమ్ముగను
గైలాసమున నుండుకరణి నీస్థితిని
వాలాయముగ మీరు వాసమ్ము సేయ
[illegible]లెగాన మేము దేవరకు నీ వేళ
వళియంచి పలికినఁ బట్టమ్ముగట్టి
వేడుకఁ జూతుము వేదాంతవేద్య !
ఏడ నుద్దనిమీరు నెంచంగ వలదు
నంగజసంహార ! యానతిమ్మనిన
నంగీకరింప బ్రహ్మాదిదేవతలు
దదుపస్కార ద్రవ్యతతులెల్లఁ గూర్చి
సదమలచిత్తులై సంతోష మొదవ
పురిను శృంగారించి బుధవరేణ్యుండు
కర మొప్పఁగా విశ్వకర్మను జూచి
నయ మొప్ప సింహాసనమ్ముఁ దెమ్మన్న
మయుఁ డంత సంతోషమానసుం డగుచు
భాసురరత్న ప్రభాసమ్ములైన
భాసమానోజ్జ్వల భవ్యరత్నముల
నమరిన దివ్యసింహాసన మ్మపుడు
ప్రమదమ్ముతోఁడ గపర్దికేతగును
నని యిచ్చి గనుగొను నమరు లావేళ
ఘనదుందుభిధ్వనుల్ గలయంగ మ్రోయ
గంగాజలమ్ములక్కఱ తోడ మంచి
బంగారుకుండల బాగుగఁదెచ్చి
యుంచినఁ గనుగొని యుప్పొంగి మది వి
రించాది సురులు వరించిన వేడ్క
శ్రీ చొక్కనాథు నాశ్రిత పారిజాతు
నాచొక్క మా పీఠి నమరంగ నునిచి
మంగళాలంకార మహితయా సర్వ
మంగళ నాచెంత మహిమతో నునిచి
హరియును బ్రహ్మయు నమరనాయకుఁడు
పరమునీశ్వరులు గీర్వాణకిన్నరులు
యభిషేక మొనరించి యాత్మ పొదించి
ప్రభగల రత్నాలపట్టమ్ము గట్టి

యున్నాళ్లు కైలాస మెన్నాళ్లు గిరులు
నెన్నాళ్లు నాకసంబెన్నాళ్లు భూమి
యున్నాళ్లు నక్షత్రమిలలోన నుండు
నన్నాళ్లు మధురలో నఖిలలోకేశ !
పన్నగభూషణ ! పళియంజి నాథ !
వాచామగోచర వారిధి శరధి !
శ్రీ చొక్కనాయక ! శ్రితపారిజాత
మీనాక్షి దేవితో మీఱిన వేడ్క
నీ నరకోటుల సేవతో మమ్ముఁ
పాలింపుచుండని పట్టమ్ము గట్టి
కేలుఁ మోడ్చిన గిరిశాయి మీఁదఁ
గురిసె పుష్పాలవాన కోటుల కొలఁది
మొరసె దుందుభులు ముమ్మరముగా దివిని
నావేళ బ్రహ్మాదు లందఱుఁ గూడి
యోదేవ ! దేవేశ ! యో చొక్కనాథ !
హాలాస్య నాయక యఖిలలోకేశ
పాలింపవే మమ్ము పాలింపు మనుచు
వేడిన వారల వీక్షించి హరుఁడు
పోడిమి మన్నించి పురముల కనిచి
యాచంద్ర తారార్క మగునట్లు భువిని
శ్రీ చొక్కనాథుఁ డుంచితలీల నుండె
నాపాండ్యభూపాలుఁ డాభూమిప్రజలు
నీపాటవీవాసునికి సాటియైన
దైవంబు లేదని తగుభక్తితోడ
నమ్మి యా సౌందర్యనాథునిఁ గొల్చి
నెమ్మదినున్నారు నిజపుణ్యులగుచు
మునులార ! యీవిధంబునఁ జొక్కనాథుఁ
డనుపంద నా మధురాపురంబునను
అలఁ జతుష్షష్టి లీలావినోదముల
విలసిల్లె నాపురి విఖ్యాతిగాను
నందమై నారదవ్యాసులు విప్ర
స్కాంద పురాణార్థ సార మేర్పఱచి
భావించి చెప్పిరి ప్రాగల్భ్య బుద్ధి

గావించి రెంతయు గ్రంథరూపమున
నటుగాన మీరలు నాపుణ్య చరిత
దిటవుగా నన్నుఁ బ్రార్థించి వేడినను
నా మహాకావ్యమ్ము నాత్మలోఁ దలచి
వేమారు సద్భక్తి వినుతించి మించి
నలువొప్పగాఁ జొక్కనాథ చరిత్ర
మలరంగ మీరలు నందఱు వినఁగ
మెఱసి యా మహిమలు మించి వేర్వేఱఁ
బరగ సంక్షేప రూపమ్ముగఁ జేసి
నానేర్చు విధమున నాదు జిహ్వకును
బూనిన మార్గమ్ముఁ బొసఁగఁ జెప్పితిని
మనమార నాస్వామి మహిమ లెంతైన
వనజాసనుండును వనజనేత్రుండు
వాసవయక్షగీర్వాణ కింపురుష
వ్యాసాది సన్ముని వ్రాతంబులకును
భావింపఁగా రాని పరమాత్మ నచట
నావశంబగునె వర్ణన నేయ మఱియు
నాస్వామి మహిమ లెయ్యెడ నెంచి చూడ
నా స్వామి యెఱుగుగా కనఘాత్ములార !
మఱి యదిగాక యమ్మధురలోఁ దక్క
నరువది నాల్గులీలా వినోదముల
నేపురి నటియించె నిందు శేఖరుఁడు
నాపురి నేగాక యాశ్చర్య మెసఁగ
గా ననేకమ్ముల కాలకంధరుఁడు
వలనుగా రక్షించు వారెవ్వ రనినఁ
జిత్రదేవు రామయ్య సాంఖ్య తొండండు
నవిముక్తదేవుండు నటుకేశి బ్రహ్మ
మడివాలుమాచయ్య మాదిరాజయ్య
బడవర బ్రహ్మయ్య భానరుసుగారు
కుమ్మర గుండయ్య గొగ్గరుసుగారు
జమ్మయ్య రెమ్మయ్య శాంత దేవుండు
కలకేత బ్రహ్మయ్య కాశి రాజయ్య
తెలుఁగెనుమనయ్యా! తెనుఁగు జొమ్మయ్య

శివరాత్రిసంగయ్య సింగిబొప్పయ్య
శివముద్దుదేవయ్య చిదిలిచందయ్య
సదమలచిక్కయ్య సంగమేశ్వరుఁడు
వుదరద రామయ్య వుండ బ్రహ్మయ్య
బాలర్సు భీమయ్య బండిదేవయ్య
పాలాక్ష్య మధురయ్య యాపెాబళయ్య
కన్నడ బ్రహ్మయ్య కవియ మల్లయ్య
కిన్నర బ్రహ్మయ్య గిరికి చెన్నయ్య
కదలి నిమ్మయ్య యేకాంత రామయ్య
యుదయమరుసుంగారు యోగిరామయ్య
సమనిత్యనేముండు శరణమ్మగారు
నమురుతదేవుండు నరిది పెానున్నయ్య
పిండయ్య బ్రహ్మయ్య యేలేశు కేశు
కొండగుడి శేషయ్య కుళ్లికె సూళయ్య
యుత్తమాంగద కేశి శెానన్నయ్య గండ
కత్తెర నాచయ్య కక్కయ్యగారు
గణరాశి మరుళయ్య కాలాగ్నిరుద్రు
నొణమేశు చిక్కయ్య యులుకు చందయ్య
పిష్మ సంగయ్యయు పిండి బొమ్మయ్య
దొమ్మర బ్రహ్మయ్య ధూర్జటి కేశి
బాచిరాజయగారు భాస్కరయ్యయును
కేచిరాజయ్య చింకేశు బింకయ్య
లెంకమంచయ్య నిజలింగ చిక్కయ్య
యంక బ్రహ్మయ్యయు ననిమిష కేశి
వీరలింగయ్యయు వీరనల్లయ్య
వీరమాచయ్యయు వీరనాగయ్య
మురుకుటు కేతయ్య ముసిడి చౌడయ్య.
సురియ చౌడయగారు శూలద బ్రహ్మ
కపిలేశు విస్సయ్య కొసయ్యగారు
కపిల బ్రహ్మయ్య ధిక్కల మలక్కయ్య
హల్లయ్యయునుగరహల్లి బొమ్మయ్య
ఒల్లెబ్రహ్మయగారు నోడలముల్లు
కల్లి దేవయ్య శింగరి మల్లనాథుఁ

డల్లమ ప్రభుదేవుఁడరయంగ వీర
లాదిగా గల యసంఖ్యాత ప్రమథులు
నాదరణమ్మున నలరు సాలోక్య
సామీప్యసారూప్య సాయుజ్య పదవు
లా మహాదేవుండు నట వారికిచ్చె
నేమని వర్ణింతు నీశ్వరేశ్వరుని
బ్రహ్మాదులకునైన భావింపరాని
బ్రహ్మమై తగు పరబ్రహ్మంబు నతఁడు
నని యిట్లువారికి నత్యంత ప్రీతి
వినిపించి మఱియును వేడ్కనిట్లనియెఁ
జొక్క నాథాయన్న శుభములు సెందు
చొక్క నాథాయన్న క్షుద్రమ్ములుడుగు
చొక్క నాథాయన్న సురుగు దోషములు
చొక్క నాథాయన్న సులభమ్ము ముక్తి
చొక్క నాథాయన్న సుగుణమ్ము గలుగుఁ
చొక్క నాథాయన్న జూచు దారాద్రి
చొక్క నాథాయన్న శూరత్వ మెసఁగు
చొక్క నాథాయన్న సురనాథు పదవి
వెయ్యేల శ్రీచొక్క విభుఁడన్న జాలు
బాయు బ్రహ్మహత్యాది పాపమ్ము లెల్ల
నీ మహాకావ్యమ్ము నిచ్చలో నూని
వేమాఱు దృఢ భక్తి వేడ్కతో నెపుడు
చదివిన వ్రాసిన జవి మెయి వినిన
మదిలోన నునిచిన మఱి నుతించినను
వినుఁడు బ్రహ్మక్షత్ర విట్ఛూద్రులకును
మనమున దలచు కామ్యార్థమ్ములొంది
పాయనిధనధాన్య భాగ్యముల్ వస్తు
వాహనమ్ములు గల్గి వసుధ బాలింతు
రాయురారోగ్యమ్ము లైశ్వర్య సిద్ధి
యిలలోన మఱియు ననేకకాలమ్ము
వెలయంగ నుందురు విమలాత్ములగుచు
ననిన సన్మును లెల్ల రతనికి మ్రొక్కి
మునినాథ ! మీవల్ల ముక్తుల మైతి.

మనిసంభ్రమమ్ముతో నానందమంది
తనువుల బులకాంకితంబులు వాడమ
హర్షాశ్రు పూరమ్ములక్షియుగ్మముల
వర్షధారల మాడ్కి వడి మించి దొరఁగ
గద్గదకంఠులై కలకంఠు సభవు
సద్గుణ చిత్రంబు జాత షట్పదుని
నాత్మ నిల్పుచు దన్మయావస్థులగుచు
నాత్మానురక్తులై యామహాదేవు
చరితమ్మునకు మహాశ్చర్యమ్ము నంది
మఱియు గుంభజునిచే మన్ననల్ గాంచి
నారద వ్యాస సన్యాసి సంఘముల
నారీతిఁ జేరి సాష్టాంగముల్ చేసి
మఱియును మఱియు నమ్మహనీయ చరిత
మరసి పేర్కొని మెత్తురమ్మను నెపుడు
శ్రీకమలాక్షు సుస్థిర కృపాలబ్ధ
రాకాసుధాంశు నిర్మల కాంతి దేహ
యరుణాచలేంద్ర పూజా మోద విభవ
భరమించు సన్నందలి? పురాధ్యక్ష
ప్రియబంధు వనచైత్ర! శ్రీపాలగోత్ర!
దయసత్యదాక్షిణ్య ధర్మస్వరూప!
జగమించు వ్యాసతీర్థప్రియశిష్య
సుగుణాఢ్య సరస్వతీ సోదర చరిత!
యౌయతోన్నత శౌర్యోఁడచ్యుతదేవ
రాయ ప్రతాప కార్యధురంధరుండ!
నంచిత కౌదమ నాయంకర గండ!
మించి వర్తించు స్వామి ద్రోహగండ!
చేకొన్న సురనూరి సింహ భుజాంక!
వాకిటిచిన్న భూవరస హితుండు
లెక్కించు జౌషష్టి శిలల వెలయు
చొక్కనాథ స్వామి సుస్థిర భక్తి
యాయురారోగ్యమ్ము లనిశమ్ము నొసఁగఁ
బాయని సామ్రాజ్య పదవి చే నెపుడు
నలరుచు బుత్ర పౌత్రాభి వృద్ధియును

గలిగి వర్ధిల్లుచుఁ గారుణ్య ధర్మ
వినయ శౌర్యౌదార్య విస్ఫూర్తి మించి
చినరామ విభువర జ్యేష్ఠ సౌభాగ్య
బసవ భూవర తపః ఫల సత్కుమార !
వసుధ గల్గిన కమ్మవంశవర్ధనుఁడ !
బాగొప్ప దిప్పమాంబా దేవి గర్భ
సాగరసంభవ సంపూర్ణ చంద్ర !
చిరకీర్తియుతుఁడైన చిన్నరామప్ప
పురుషరత్నంబనఁ బొగడంగ మించు
లలితకీర్త్యభిరామ ! లావణ్య సోమ !
ఇలసిల్లు పెదరామ ! విభవసుత్రామ !
నరనాథ ! శ్రీ చొక్కనాథ సత్కృపను
ధర నేలు మాచంద్ర తారార్కముగను.
ఇది సర్వఘన సత్కవీంద్ర పాదాబ్జ
విదితపూజామోద విమలుండు పచ్చ
కప్పుర సౌరభ్యకలిత వాణాంక
తిప్పరాజ సుపుత్ర తిరువేంగళేంద్ర
విరచితమ్మగు లోకవిఖ్యాతమైన
సరస లక్షణకావ్యసత్కవీంద్రాభి
నందితశ్రీచొక్కనాథ చరిత్ర
మందును నిది నవమాశ్వాస మయ్యె

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఓం తత్సత్.